# ఆత్మకందములు

గ్రంథకర్త:

బవనం వీరారెడ్డి

పరిష్కృతము:

చిల్లర వేంకటేశ్వరకవి





[వెల : నాలుగు అణాలు

శ్రీ జయనామ సంవత్సరం : : 28-10-54



గ్రంథకర్త:
బవనం వీరారెడ్డి

# తప్పొప్పుల పట్టిక

| పుట సంఖ్య | తప్పు | పంక్తి సంఖ్య | ఒప్పు |
|---|---|---|---|
| 1. | దాంకుర | 19. | దారకుర |
| 4. | యెవనినై | 10. | యెవనినైన |
| 7. | యుందురె | 14. | యుండుసురె |
| 8. | వీలగునాకో | 22. | వీలగునాక్కో |
| 11. | తలపు | 13. | తలపున |
| 16. | తానెందిరుగు | 17. | తానెంపు దిరుగు |
| 19. | మెలగవయు | 4. | మెలగవలయు |
| 23. | యిండగా | 9. | యిడగా |
| 38. | రేపెటుటయా | 14. | రేపెట్టుటయా |
| 40. | వలయును | 12. | వలయు |
| 44. | నీటగ | 22. | నీటుగ |
| 56. | చెడిపాదువన్న | 2. | చెడిపోదువన్న |
| 56. | మిఱల | 22. | మఱల |
| 57. | యుండవలయును | 18. | యుండవలయు |
| 64. ద | మతిదెలియు | 5. | కం. మతిదెలియు |
| 67. | స్వేగ్ఛ | 9. | శ్వేశ్ఛ |
| 67. | జూచిచెనంట | 9. | జూచెనంట |
| 69. | నారున్న | 23. | నోరున్న |

vii

## ఆత్మ కందములు

క. ఆంధ్రప్రభ యాంధ్రపత్రిక
యాంధ్రంబునఁ బ్రచురమగుట ♦ యాంధ్రంబున క
య్యాంధ్ర నిఘంటువు లుండుట
యాంధ్రుల విషయంబు దెలియ ♦ నగు నెల్లరకున్.

క. మంచియె చెడుగా మారును
లంచంబులఁ దినుచున్న ♦ లాతిజనులకున్
కంచెడు దిని మంచంబున
నంచితముగఁ బండనగునె ♦ యలయకకు జనుల్.

క. దొంగల చౌర్యము కనుగొన
లొంగిన యటు మాటలాడి ♦ లొంగక మీదన్
దొంగతన మాచరింతురు
దొంగల గుత్తెఱిఁగి తొత్త ♦ తొలఁగఁగ వలయున్.

క. కందము తెలుగున కందము
కందంబునఁ జెప్పఁబడిన ♦ ఘన నీతుల మీ
రందఱును జదువుకొనిన న
మందానందంబు గలుగు ♦ మానస వీధిన్. ౭౭౦

క. పతి సంగతి సతి దెలిసియు
సతి సంగతిఁ బతి యెఱింగి ♦ జతగలిసిననే
హితమగు ముక్తికి నదియే
గతియగు నీ విధము దెలియఁ ♦ గాఁదగు మనకున్.

# ఆత్మకందములు.

క. స్త్రీ కంటె ధరణి బూరుషు
డే కరణిని గొప్ప వాఁడు ♦ హీనుఁడె కాఁడా
జోకొట్టి చన్ను గుడిపిన
యా కామిని తల్లి గొప్ప ♦ దా దెలుగ రాజో.

క. కామమె మూలంబంతకుఁ
గామం బాత్మీయమైనఁ ♦ గాకి తరులచేఁ
బ్రేమింపఁ బడినదైనను
నీమంబున ద్రుంపవలయు ♦ నేర్పరు లెల్లన్. ౨౨౩

క. వాఁడే మొగంబు వాఁడో
పోడిమిఁ దెలియంగ నగునె ♦ బుధులకు నైనన్
జాడంగని పరమాత్ముని
జూడంగలవాఁడె మోక్ష ♦ సుఖమొందుఁ జుమీ.

క. బడి బడి దిరిగియు దిరుగాఁ
నడుగడు గాఁద్రై మున్నె ♦ నడుగఁడ మేలా
నడువడి గుదిరిన మనసా
బడదొడ్డియూ భాద భీతె ♦ బంగరు డగుటన్. ౨౨౫



ఆత్మ కంద[illegible]లు

క॥ తేనెవని తాత సొమ్మగుం
బానక మేవిధములగల్గు ♦ బూర్వమ్మే జెప్పెన్
మానవులమె మనవారము
గానండీ యర్థమెరుగ ♦ గలియుండన్నా ౮౫౧

క. పొగ చుట్ట త్రాగనేరిచి
పొగవిడుచుచు నుంటినయ్య ♦ బోబెదమనో
పొగ ద్రావెడు పగవాడనె
పొగవిడుచుచు నూదుచుండ ♦ పొలమనుటకుగా. ౮౫౨

క. టక్కరుల గూడి దిరుగక
నొక్కట సూత్రమునుగట్టు ♦ నాతిది పొందే
చిక్కటమగు మోక్షమెరుగ
మక్కువగా జతగలసియె ♦ మనిగుంటిమిగా. ౮౫౩

క. కంచము కంబళి దింపట
కొంచము గుపుసంగ మనుట ♦ కొంపండగడ్డొకో
పంచల జత లెరిగి కొడవు
పంచలకెఱ దారమెఱుక ♦ బోధుండుటకున్. ౮౫౪

క. ఏ కుల మే పూరుడును
యాకులమే ఘనమనుమ్మి ♦ యెవరననలయున్
మీకగు మాకగు ఓటుల
పోంకమిచే దెలియవచ్చు ♦ బోకెందుకగున్. ౮౫౫

క. పొయ్యికి బొంగలి వెచ్చము
నెయ్యాయు గరుగంగ మ్రింగ ♦ నెరవేయుటగాం
బయ్యెఱ గాలికిం బంటలు
వెయ్యన నేజెప్పగలన ♦ విషవాయువుగా. ౮౫౬

సమాప్తి.

# ఆత్మ కందములు

క. బడిబెట్టినంత మోదుము
యడుగడుగాదైవమున్నా ♦ యుడుగడ మెటులా
నడువడి గుదిరిన మనసా
బడదెద్దియు బాధభీతి ♦ వసమేలిమిగాన్. ౨౨౫

క. పాదము వీరయ నుడివిన
మందిలో దాజెప్పుకున్న ♦ మంచిది యగు గా
కొదవయు దీరిన తదుపరి
పదె పదె పరమాత్ముయుండ్ను ♦ పరమందుటకున్. ౨౨౬

క. డబ్బనగను ధనమెంతయొ
డబ్బగదా పైసలెన్న ♦ డాబును దెలియగా
యిబ్బందులెల్ల గడువగ
జెప్పెదలోకమునకిట్లు ♦ జెడిపోకుంటన్. ౨౨౭

క॥ ధనమెందు దాచదగునా
ధనమెందున దాచుకున్న ♦ తనకలవడుగా
ధనమునకు రాజెబుచ్చియ
తనకుమారు వీరయ్యన ♦ దశగనుమయ్యా ౨౨౮

క. సత్యము తోడుత మెలగెడు
సత్యంబును గంటబడుకె ♦ సంతోషంబై
సత్యము నదలకె మెలగుర
సత్యమునకు సాటియెద్ది ♦ సంతోషముగాన్. ౨౨౯

---

క. ఎఱుకగు వారలు నుడివిన
యెఱుకగు చుట్టంబుగన్న ♦ యెఱుకగు టరుదా
నెఱుకకు యెఱుకగు గలయిక
నెఱుగుట మానవుడు సుమ్మి ♦ నెఱుగును దైవం. ౨౩౦

హరిః — ఓమ్

శుభమస్తు — అవిఘ్నమస్తు

# ఆత్మకందములు

కం॥ శ్రీరామ రామ యనుచును
నోరూరఁగఁ బలుకవలయు ♦ నుడువుల శుద్ధిన్
ఆరామ నామ మంత్రము
సారాముల భక్తి గలిగి ♦ చదువఁగ వలయున్. ౧

క॥ భగవంతుఁ డొక్కఁ డుండఁగ
భగవంతున కెపుడు మ్రొక్క ♦ భరితాత్ముండై
జగమున నూతేండ్లాయువు
నొగి నొసఁగును జెవుడు గ్రుడ్డి ♦ యుండదు మనసా! ౨

క॥ నారాయణ యన విషమూ ?
తీరుగ వృత్తి చంచలంబు ♦ దెగఁ గొఱకుఁ గదా !
నారాయణామృతంబును
నోరూరఁగఁ గ్రోఁగఁగా ఘ ♦ నుండగుఁ జుమ్మా. 3

క. వట్టిది మంటిది గాదుర
గట్టిది యిదికాదు; కాని ♦ కాలము చేయిం
బట్టిన పట్టును వీడక
పట్టినఁ బరమాత్మ నీకు ♦ బరసుఖ మిచ్చున్. ౪

క. వినవలెఁ జెప్పగ నందురు
వెనుకాడక నూటిగాను ♦ వినవలసినదే
వినకున్న దొంకు టెట్లో ?
వినరాని చెవులు ద్రుంచ ♦ విరివిగ జీవా ! ౫

క. చెప్పక చెడిపోవుటయే
నొప్పగ మది చెడక యుండ ♦ నోపికతో గా
నెప్పుడు జ్ఞానము గల్గునొ
చప్పుడు గాకుండ నేఁగు ♦ జయమున జీవా! ౬

క॥ రంగుగను రంకు చేసియుఁ
బొంగుచు సరియెవ్వరనుచుఁ ♦ బోదురితంబౌఁ
బొంగణఁగు వేదమెఱిఁగిన
దొంగనుదేల్గుట్టి నట్లు ♦ తోఁచురజీవా! ౭

క॥ మాయ యన నెట్టిదో య
మ్నాయపదమ్మెట్లఁ గలిగె ♦ మహిలోపలనీ
మాయయన నీశరీరమె
మాయను ఖండించు కత్తి ♦ మది శివయనుమా! ౮

క॥ దొంగను వలదనకుండా
దొంగలకును మొదటివాఁడు ♦ దొరకక యుండెన్
దొంగలుగాకయె దొరలా
దొంగలదండింప వీలు ♦ దొరుకునె జీవా! ౯

క॥ బెట్టుగ సద్దును లేకయె
భొట్టను బెట్టంగవంక ♦ పోవునుగాదా!
గుట్టును దెలిసిన పిమ్మటఁ
బట్టును బట్టంగ దొరకుఁ ♦ బరమాత్ముండే ౧౦

క॥ నాదని కావలి యున్నది
నాదని మదిఁ దోఁచినపుడు ♦ కలుగును జ్ఞానం
బేదిఁక నాదను వస్తువు
భేదంబిఁక నెఱిగి చెప్పి ♦ విభునిం గనుమా! ౧౧

క॥ నిత్యముగాదీ దేహము
మృత్యువను తుపాను పట్టి ♦ మ్రింగును జుండీ
యత్యంతం బిదినిలువదు
సత్యముగా వలయుఁజుమ్మ ♦ సద్గుణ శీలా ! ౧౨
ధనమొసఁగెడి దాతలఁగని
తన కర మది వణఁకనిచ్చుఁ ♦ దానును నెపుడో
యనుమానము లేకుండఁగ
నొనరుపవలె దానములను ♦ నొప్పగ జీవా ! ౧౩
క॥ ఓటిదిర కూటి కుండయె
కోటియు నొకనాఁడె యెపుడొ ♦ కోల్పోవుటయా
బూటకపు తోలు తిత్తిర
బూటకముల నమ్మదగదు ♦ బొంకుర జీవా ! ౧౪
క॥ అమ్మల నెఱుఁగవు తోలుతఘు
నమ్మని పరకాంతఁదల్లి ♦ నమ్మఁగఁదగురా
నమ్మిన భక్తులు చెడరుర
నమ్మఁగ నీవశమె హరిను ♦ నంబున జీవా ! ౧౫
క॥ కలిగిన దానికి వేడుక
యిఁకఁ గూలినదాని కేడు ♦ పెఱుఁగని వాఁడి
య్యిలలో భక్తుండనఁదగుఁ
దెలియవలయు నీవిధంబు ♦ దెగడక శ్రద్ధన్ ! ౧౬
క॥ మలమునఁ బొరలెరె మొదటను
మలమన్న నసహ్యమేల ♦ మనుజుల కెల్లన్
మలముండదె యుదరంబునఁ
గలదట్టులె పాపచయము ♦ గనరా జీవా ! ౧౭

క॥ పనులం దక్షము గానిది
తనకేమియు ఖర్చులేక ♦ తగ వెలుఁగునుగా
మనసున నిడుకొనఁ జెల్లును
ఘన మన్నిటికన్న మిన్న ♦ గనరా జీవా! ౧౮

క. తనజన్మ తల్లి యెఱుఁగును
దనకామము దీర్ప నెఱుఁగుఁ ♦ దరుణీమణి తా
నొనరించిన ఘనపాపము
ననువునఁబుచ్చంగ నెఱుఁగు ♦ హరియొక్కండే ౧౯

క॥ తలఁపక కార్యంబగునా?
బలిసితినని యెవనినైనఁ ♦ బడఁ గొట్టెదవా?
కలిగెడు దప్పిక తీరఁగఁ
గొలనికిఁజన నీరుదొరకుఁ ♦ గొఱవేమిటికో ౨౦

క. ఎఱుఁగక పుట్టుటనిజమే
యెఱుఁగని కాలంబులేదొ ♦ యెవ్వనికైనన్
ఎఱిఁగిన జన్మమె జన్మము
మఱికిని బుట్టంగఁదగునె ♦ మొనగాఁడైనన్. ౨౧

క. ధనమిచ్చి పేపరుంగొనఁ
గనులందును నీకుగారఁ ♦ గనఁగానేలా?
కనుగొని రక్షించెదవా
తనలోపల శాంతమూనఁ ♦ దగునో జీవా! ౨౨

క. నలుసంత చేడనుండియొ
పలుఁదోమియుఁడిండి కొఱకుఁ ♦ బరుగిడుచుండున్
ఫలహారంబులు పదియని
మొలకెత్తని విధము కనదు ♦ మొదటనె జీవా! ౨౩

క. చింతింపకు మేపనికిని
జెంతనుగల మంటిద్రవ్యఁ ♦ జెడునా పురువు
ల్పతంబు విడువరాదుగ
యింతకు మానసొప్పి చంప ♦ నేటికిఁ బరులన్. ౨౪

క॥ తిట్టిన దిట్టకయుండుఁడి
పట్టిది యీ మాయతనువు ♦ వగలు మఘంబున్
బుట్టిన పురుషుండెట్టులో
తిట్టువడం బోవుటరుదె ♦ తిరముగఁ జెప్పుమా. ౨౫

క॥ తనువా సంపద గోరుట
కనులా రూపంబు గనుట ♦ కనరాదుగదా
వినఁగోరు బలుకు నెప్పుడు
వినవచ్చును బలుకునెపుడు ♦ విడరాదుగదా ౨౬

క. పలువలు దైవము లేఁడనఁ
గలఁడని మది యుక్తిఁ బన్ని ♦ కదలకయు డన్
మొలిచిన వృక్షమునందున
ఫలమందమె చూడ జగతి ♦ బరమానుగనరా ౨౭

క. అడిగియు నడుగక మున్నే
వడివడి తా ధనమునిచ్చి ♦ వడినంపియుఁడాఁ
బడిపంచలఁ బడిముద్దనఁ
జెడుకట్టియు యనరెయతఁడు చెడిపోవఁడో ౨౮

క॥ నారాయణ నారాయణ
నారాయణ యనినఁ దమకు ♦ నాశనముగాదో
నారాయణునకు మించిన
నారాయణ వేఱుగలఁడె ♦ నాకును జెప్పుమా. ౨౯

క॥ మానవ ధర్మంబని తా
మానవుఁడై యన్న మడుగ ♦ మానకయిడు లే
మానవలక్షణమిడఁ డో
మానవుఁడే కాఁడు పశువు ♦ మార్గము జీవా! 30

క॥ ఒల్లని సతినొల్లనిసుతు
లెల్లగలక్ష్యంబుసేతు ♦ రితఁడనదయాటం
చుల్లసమాడుచు నుందురు
పెల్లుగ నెవ్వానినైనఁ ♦ బృథివిని జీవా! 31

క॥ జయమనఁగ దానమొంతయుఁ
జెయిసాగిన యంతవఱకుఁ ♦ జేయందగునా?
ప్రాయిపాలు పొంగుపాత్ర
మ్మోయుశక్తికిమించి చనుట ♦ మేలగునోకో 32

క. పరమాత్మసన్నిధావుఁ
బరమాత్మని భక్తుఁడెపుడు ♦ పరికించునుగా
మఱచితినని మోసంబని
యెఱుఁగు రహస్యంబులెల్ల ♦ నెఱుఁగనిరీతిన్ 33

క. వినవో వగాయను సతతము
కనకంబే మేలటంచుఁ ♦ గడియించుచు నీ
వనవరతం బాచింతనె
చనియెదవో పలకును మేలు ♦ సలుపందగదే? 34

క. చూపునకందని వస్తువు
రూపంబును దెలియఁజెప్ప ♦ రూఢిగఁదమలోఁ
దీపికి దివ్యామృతమై
యోపికఁ గలిగించుఁ గోలు ♦ చుండుము జీవా! 35

క. ఎఱుకలవాఁ డుచ్చులనిడ
నెఱిఁగిన బకమెట్లుదాన ♦ నిఱుకునుబరుగూ
పెఱుఁగని మానవుగతిఁబరు
నెఱిఁగిన మానవుఁడుమాఁయు ♦ నేటికిఁజొచ్చున్. ౩౬

క॥ పసితనము పడుచుఁదనమని
ముసలితనంబనుచు దేహ ♦ మునుగాం చెడువాఁ
డసలెప్పటికిని జెడఁడిది
పస లేకయె యుండియోఁడుఁ ♦ బసరమురీతిన్ ౩౭

క॥ పదుగురుఁబది వావులచేఁ
బదపడిపిలువంగ నొకఁడె ♦ పరగిడుఁగాదా
మదిఁదలఁప బెక్కుపేరులు
గదపనికి శ్రద్ధఁబిలువఁ ♦ గన్నదు జీవా! ౩౮

క॥ పరమాత్ముఁడిచ్చు సర్వముఁ
బరులనుయాచింపననుచుఁ ♦ బడియుందురే!
పరమాత్మనెఱిఁగి చేరెడు
తెరువెఱుఁగకయుందురెసుధీయుతు లెప్పుడున్ ౩౯

క॥ అన్నాయని పగలంతయుఁ
గ్రన్ననవాతనికెలంజె ♦ గారాత్రులనై
యున్న తెఱంగున శ్రీహరి
నెన్నుచుదుప్కియలఁజలుపు♦ టెఱుఁగుముజీవా! ౪౦

క॥ ఎప్పుడొకట్టిన కొంపిది
తప్పకనిప్పంటుకొనుట ♦ తధ్యంబనితా
నిప్పుడు నీరంబునకై
చప్పునఁ బరుగెత్తనగును ♦ జల్లార్చుటకై ౪౧

క॥ ఈతనువురి త్తచేతల
బూతము కాదయ్యనియత ♦ బుద్ధినిబరుసన్
జేతములో నిడినామం
శాతతముగనుభవముక్తి ♦ నందును జీవా ? ౪౨

క॥ శునకము మూత్రవిసర్జన
మునుదనపైఁ జేయఁజూచి ♦ మొద్దుగఁ ద్రోలం
గనుశక్తిలేని శిలలం
గొనియాడుచుఁ గోల్వముక్తిఁ గూర్చునె జీవా ! ౪౩

క॥ లోకములో జీవునకును
నాఁకలియనుబాధయెపుడు ♦ నంటునుగాదా ?
యాకలియు కాలమెఱిఁగియుఁ
బోకలఁ బోవంగమనసు ♦ పొందికదోఁకున్ ౪౪

క॥ వెన్నుండెయైన నేటికి
వెన్నయుమజ్జి పెరుగుపాలు ♦ వ్రేతలుఁబసులుం
జిన్నతనంబనఁ జెల్లునె ?
యన్నన్నా ! పరునెఱుంగ ♦ నగునేమనకున్ ౪౫

క॥ మునులాత్మారాముఁగనుఁ
గొనియానందంబునొంది ♦ కుమరగు మోహం
బునుగాంచిరి ప్రతిమలఁబూ
జనమొనరుప ముక్తినొంద ♦ సాధ్యమె మనకున్ ౪౬

క॥ తలుపును మూసిపరుండిన
వెలుపలఁజోరునకుఁ జొఱఁగ ♦ వీలగునొకో
చలియింపక జ్ఞానముతో
నిలిచిన దుర్గుణముచేర ♦ నేర్చునె జ్ఞానిన్ ౪౭

క॥ తిట్టంగ నేల దేవుని
బెట్టుగఁ దనకాలమందుఁ ♦ బెట్టఁగ నెవఁడో
నెట్టులఁ గలిగెను దుర్గుణ
మెట్టుల మాన్పంగవచ్చు ♦ నెల్లను జెపుమా ౪౮

పరులేమన్నను మానక
పరమాత్ముండెఱుఁగు నిజముఁ ♦ బరికింపంగా
గరికైననూఁగఁ బోదఁట
కొఱకదుచీమయును బరున ♦ దం దెలియకయే ౪౯

క. ఏమగునో ప్రాణమనుకొని
కామముచేఁదిరిగి నరుడు ♦ కానఁడుకర్మం
బేమగునో మాయ దెలియక
పామరులకుఁ జిక్కవచ్చుఁ ♦ బరుఁగానమిచేఁ ౫౦

క. ధనమె నరకమునకంపును
తనదానమె సుకృతమిచ్చుఁ ♦ దనకలిమియుఁ దా
ధనమేమఱుఁగుగ నుండియుఁ
దనువే ఛీయనఁగఁజేయు ♦ ధన్యులకెపుడున్ ౫౧

క. ప్రేమాధికారివలెనే
ప్రేమింపందగిన నిసువు ♦ ప్రేలదె మిగులం
బ్రేమను దానేఁగినహరి
ప్రేమకుఁదగియుండిముక్తి ♦ రీతింబొందుఁ. ౫౨

క. వట్టివి గట్టివి కలిపియు
బిట్టుగశాస్త్రములు కట్టి ♦ పెట్టెఁతలపై
గుట్టగు వేదంబును జే
పట్టియుఁ బ్రాకంగ నగును ♦ బకుగెవడైనన్ ౫౩

క. పొట్ట పగులంగ దినుఁగద
పిట్టమెటుకు తినినరోగ ♦ పీడితుఁడగునా?
తిట్టను గుంటిని గ్రుడ్డిని
బెట్టెఁడొకింతయును నదియె ♦ ప్రియపడి యెపుడున్. ౫౪

క. తప్పెఱుఁగ కేమిచేసినఁ
దప్పెఱిఁగిన జ్ఞాని యెట్లు ♦ తప్పొనరించున్
ఒప్పెఱుఁగవచ్చుఁ దఱుతమ
తప్పెఱిఁగినవారె ధన్యు ♦ తము లిద్ధాత్రిన్. ౫౫

క. రమ్మనఁగ రాదుసుమ్మా
పొమ్మనఁగా బోవదెద్ది ♦ పోలికఁ గనవా?
కమ్మనఁగఁ గాదుసుమ్మా
నమ్మిన దైవంబు మహిమ ♦ నలినంతటికిన్. ౫౬

క. కథలు బహుసుకృతములఁట
కథలకు నాయకుని శివునిఁ ♦ గలియుట యెట్లో
శిథిలంబగు నీ ప్రకృతిని
వ్యథితుండై చిక్కి మోస ♦ మందుట తగునే? ౫౭

క. చీయన్నఁ బలుకు నపుటయ్యుఁ
జాయనఁగాఁ బల్కునపుట ♦ చనునే ధరలో
నోయమ్మ చచ్చినానన
నీ యుగమున లేనిదెవరో ♦ నీవెఱుఁగుము రా ౫౮

క. నలిఁగినచోఁ దొలఁగును గద
బలసిన నా విధిని దొలఁగి ♦ పనిచేయువలెన్
గుఱుతునెడు పలుకు మఱవుము
వెలలేనిది దక్కవలయు ♦ వెతపోవుటకున్. ౫౯

క. చెప్పిదిగో కొట్టెదరా
తప్పన్నది తెలియు మనెడి ♦ త్వరితంబేలా ?
యొప్పదె తాల్మివహించుట
చెప్పిన సవరించుకొనరె ♦ చెడుగెవరైనన్. ౬౦

క. ఎవ్వఁడ నేనన నేటికి
నెవ్వండీ లోకజాల ♦ మెల్లను నిండెన్
మొవ్వల కోడెగ నెఱుఁగక
మవ్వంబుగ గొల్వుమరి న ♦ మాజము దీక్షన్. ౬౧

క. పడవా నిలువగ నుండును
నడపెడు నావల్లెకాఁడె ♦ నటియింపంగా
వడివడిగ దరికిఁ జేరును
విడిపించక ముంచకెపుడు ♦ విరివినిజూపున్. ౬౨

క. పసితలఁపునఁ బవళించినఁ
బనికై లా నరిగినట్లు ♦ పనియైనటులన్
గనుపట్టు నెల్లెపరమును
మనసున ధ్యానింపవచ్చు ♦ మహిఁగడతేరున్. ౬౩

క. అందమన నేమిలోకం
బందమునా న్యాయమె మ ♦ హా పరమాత్మం
బొందిన దగుటనె వినఁగన
నెందుకు వెనుకాడ వలయు ♦ నెఱుఁగఁగ జెప్పుమా ౬౪

క. ఈ తనువునొప్పి తనకగుఁ
దాతల తనువులను నొప్పి ♦ తనకలవడునే
నీతి విడనాడి తిరిగినఁ
గోఁతియె మేల్గోరులు కర్మ ♦ కుం గర్తలొకో? ౬౫

క. ధాత్రిని సర్వముదానై
పత్రంబునఁ బవ్వళించు ♦ పరముఁడు హరి యా
శత్రుత్వమూని చంపును
బుత్రుండేయైన దుష్ట ♦ బుద్ధినిజీవా! ౬౬

క॥ ప్రస్తుతము ప్రత్తియొకటియె
దుస్తులు పదివేలు మృత్తు ♦ తొలుత నొకండే
సిస్తుల భాండములేన్నో
వస్తువులధికంబు మొదట ♦ బంగరు వొకఁడే. ౬౭

క॥ కన్నుల కగపడు కాంతల
యున్నత కుచములను గోరు ♦ చుంట సహజమహా
పన్నగఁ గృశాను సన్నిధి
వెన్నకఱఁగదె విచిత్ర ♦ విధమే తెలపన్. ౬౮

క॥ ఎద్దు మొడఁగాడిఁ బెట్టఁగ
బిద్దలు సాధింతురద్ది ♦ యెఱుఁగుదువుగదా!
పెద్దలు పెక్కుఱు నుడువఁగ
నెద్దును మించితివి వినక ♦ యెంతకు మతివో. ౬౯

క॥ అన్నము కంటెను బట్టల
కన్నను మిగులంగఁ జాలు ♦ కలిమి యదేలా!
యెన్నియొ యిడుములఁ బడియెద
వెన్నఁటికిని విడువరాక ♦ కెయ్యది హద్దో? ౭౦

క॥ కేకల వేటికి దైవము
చీఁకటి గుహయందు నిద్ర ♦ జిక్కినవాఁడా?
లేకుండినఁ దాఁదలఁపఁగ
నీకడ కరుదేఱకున్నె ♦ నీతిందెలియన్. ౭౧

క. అంగిలి కంటని దేటికిఁ
బొంగుదువా కాశిగంగఁ ♦ బొరిఁ దేనేలా?
గంగయెట లేదు చూడఁగ
రంగని కే మిడఁగవలయు ♦ రయమున జెపుమా! ౭౨

క. పాలెట నవపూసంబులు
బాలును నన్నంబు మెక్కి ♦ పారాడంగాఁ
జాలంతట నడతురుగద
కాలము గతిఁబట్టినడువ ♦ గానగుఁజుమ్మీ. ౭౩

క. మగతనములేని మగనిన్
మగువయుఁ దామరుగు నిడక ♦ మరలించునుగా
మగని పరిచర్య లేకయె
మగఁడొల్లక విడిచి యున్న ♦ మతి కేమందున్? ౭౪

క. తల్లియుఁ బిల్లలుఁ బీఁకెడి
నల్లుల గంచమునఁగూర్కి ♦ నవరాత్రము లీ
యుల్లమున నాఁ అవకుండీ
ప్రల్లదనంబెఱిఁగి పిదపఁ ♦ బనుపఁగ వచ్చున్. ౭౫

క. మాయతను వెందుకనఁగాఁ
జీయను మానవుఁడు రిత్త ♦ సిగ్గొలుగఁదా
ప్రాయమ్ము వచ్చి చూపిన
మాయను మఱి నెఱిఁగి పిదప ♦ మానక యుండున్. ౭౬

క. పుట్టినదిల దెసములలో
పట్టివి వేషముల మిగుల ♦ పదలిఁగ మేలా?
పుట్టినవార దరుటకా
పెట్టిన వేషముల తాత ♦ బెదరింపునకా? ౭౭

క. అన్నం బడిగిన లేదట
యున్నప్పుడు నోటికఃయె ♦ యున్నత మగునా?
నిన్నెవ్వరు గాదనియెద
రున్నందుకుఁ జేనిబొమ్మ ♦ యున్నది ఘనమా? ౭౮

క. ఒద్దికుఁజని ప్రేల్వంచక
బుద్ధిని గ్రహియించి నపుడె ♦ బుధుఁడవు సుమ్మీ
పెద్దది గజమ్ము గాదో
బుద్ధియె ముఖ్యమ్ము సుమ్మ ♦ బుధనుత చరితా ౭౯

క. కనకంబు పళ్లెరంబునఁ
గనులకుఁ గాన్పింప నాస ♦ గాఁ జూతువుగా
తనపొట్ట పనికి రాదుర
మనసున వంకరలు లేక ♦ మసలుము జీవా! ౮౦

క. ఇంటికి పొంటికి నెడమా?
యంటిన మైనగును గడుగ ♦ నందము సుమ్మా
కొంటె యొనర్చెడు చేతలు
కంటికిఁ గన్పింప మాన్పఁ ♦ గా లేవౌరా. ౮౧

క. వాఁడేమి చేయునంచును
పీడన వసియించు చుండి ♦ పీడక యుండున్
గాడెద్ల మోటతోలిన
వేడక బ్రతుకఁగపచ్చుఁ ♦ బృథివిని జీవా! ౮౨

క. ఏతనువు నిద్రచెందదొ
యేతనువును నాసబెదరు ♦ నెందును లేదో
యాతనువు లక్షణంబులె
యాతనువునకబ్బ సౌఖ్య ♦ మెప్పుడుఁ గల్గున్. ౮౩

క. ఎందుకు నుడివెద వనఁగా
మందును గలుపంగఁ గుదురు ♦ మది తెగులెల్లన్
బొందింపుము పీనుల నిది
తొందర నసియించు మదము ♦ తోడనెఱుంగన్ ౭౪

క. వినసొంపు తియ్యదియ్యది
ధనమున దొరదిగినయట్లు ♦ తగదగ పడఁగా
మనసెంతో వికాసంబగు
కనుఁగొనఁగా నొసటివ్రాఁతఁ ♦ గనఁగూర్పఁగదా! ౭౫

క. మరణము దాపునఁ గలదఁట
పరమాత్మని తలఁపుగల్గ ♦ బరసుఖమందున్
బెరపలుకులు వెయ్యేటికి ?
నిరతముఁ బరుసేవచేసి ♦ నెగడవె మనసా ! ౭౬

క. పండిన వెండిన ధ్యానము
పండిన యావట్టకంబు ♦ వడిఁదినఁ జనదే
పండిన ఫలములఁ బిండము
లుండవు ధరలోన లక్షము ♦ నొందును మనసా.

క. వరిపైరులేని పొలమే
నరుఁడైనను మెచ్చఁ డన్న ♦ నరుదనరుగదా !
పరమాత్మని జింతింపక
మరుగకు మోక్షంబు గలదె ♦ మనకెప్పటికిన్ ? ౭౭

క. ఎందుకు సుద్దులు వినఁగా
ముందరగతి నెవరుగాంచి ♦ మురిసిరి భక్తిన్
బొందిన కష్టము వాయఁగ
డెందంబునఁ బరుభజించు ♦ ఓ తారకమహా. ౭౮

క. ఊరూరఁ బడిన యపుడే
నేరక కర్మమున జన్మ ♦ దిందలఁ బడఁగా
నూరక యూఁకొన నేమగు
రారమ్మని ప్రోచునట్టి ♦ రాముని గనరా. ౯౦

క. దెబ్బలభీతియు జాలియు
నబ్బని కాలంబు గడుప ♦ నబ్బినవాఁడా
నిబ్బరము గల్గువానికి
నబ్బును మోక్షంపు దోవ ♦ యఁనగా వచ్చున్ ౯౧

క. మిక్కుటముగ మెక్కియుఁదాఁ
జక్కఁగ నానుదుటివ్రాఁత ♦ సరిలేదనుచుం
గ్రక్కున దిట్టెడి మూఢుల
నెక్కరణిని దేర్పవచ్చు ♦ నిలలో జీవా! ౯౨

క. అన్నమె జీవనమున న
య్యన్నము గుడువంగఁ బెట్ట ♦ నర్థంబీవా
యెన్నఁటికిని నీయింటికి
నున్నర నారాక యనును ♦ జూఱుచుఱఁ జూచున్. ౯౩

క. తానెం దిరుగు చున్నను
దానెంతయొ జపముచేసి ♦ ధ్యానించిన వి
జ్ఞానము సంపాదించిన
మానవునకు క్షుత్తుసతము ♦ మానక యుండున్. ౯౪

క. కట్టెలలోపల నగ్నిని
నెట్టులఁ గనుగొనఁగవచ్చు ♦ నెవ్వరికైనన్
గట్టిగలోఁగల పరముని
బట్టఁగ వెనుకాడవలదు ♦ పరమందుటకున్ ౯౫

క. పోరపడు సంగతులుండిన
మఱికొందఱి నడిగి తెలిసి ♦ మదినిల్పనగున్
మఱవని పదవియె దొరకిన
మఱియొక్కరి తోడనేల ♦ మాట్లాడంగన్  ౯౬

క. చెప్పఁగ నెఱిఁగియుఁదానా
పప్పులె మఱిబెట్టుఁడనుచుఁ ♦ బలుకకయున్నే
చెప్పఁగ దలఁచినవారల
తప్పుల నెన్నంగఁదగదు ♦ ధర నెప్పటికిన్.  ౯౭

క. తొమ్మిది కంతలతిత్తను
నమ్మక మిప్పుడైనఁగల్గె ♦ నాగుణియింపన్
నమ్మక దేహమునాదను
నమ్మకముండిన నసించి ♦ నరకమునఁ బడున్.  ౯౮

క. గలగాంచుట యొకచిత్రము
గలిగినయా మెలకువందుఁ ♦ గనఁబడు నటులే
యిలమీఁద దనువుబుడగలు
కలగాఁదానమ్మ ♦ వలయుఁ గడఁకను జీవా!  ౯౯

క. సారంభిది చదువులలో
నూరక పెరవారిఁజేర ♦ నుచితంబగునా?
కోరికలు వదలకుండఁగ
నూరక యదిదొరకునెట్టు ♦ లూహింపంగన్.  ౧౦౦

క. నారాయణయను నామము
తారకమని మదిని తెలిసి ♦ తా జపియింపన్
దీరిక లేదని మానక
కోరఁగమది ముక్తిగల్గు ♦ గుఱినిల్పుమురా!  ౧౦౧

క. బమ్మ యొనర్చెడి బొందులు
కుమ్మరి ధరఁజేయుఁ డొక్కొక్క ♦ కుండలు ముంతల్
సొమ్ములు కనకంబుననగు
బొమ్మల చిత్రంబు దెలియ ♦ బొంకగు నెపుడున్. ౧౦౨

క. ఋణమున జన్మము గలుగును
ఋణమెట్టులఁ దీఱవచ్చు ♦ ఋజువనఁగలఁవా ?
గుణమే ఘనమై నిలువఁగ
తృణమునఁ దొలఁగంగ నగును ♦ ఘనఋణమెల్లన్. ౧౦౩

క. కల్లుకడ కేఁగి యానుచుఁ
దెల్లని యా పాలఁ గ్రోలఁ ♦ దెలియక యుండున్
గల్లరి మానిసి స్నేహం
బొల్లదు కష్టములు గల్గు ♦ నురుగుణి కైనన్. ౧౦౪

క. తద్దగ సిరి గలదనుచును
మిద్దెలు మేడలును గట్టి ♦ మిణుకుదువంతే
ప్రొద్దును తెలియవ దేమిర
యెద్దును బాడుపంగ నడుచు ♦ నెద్దేమిగులా ? ౧౦౫

క. ముద్దయు నీరము నడుగఁగఁ
గొద్దిగ నిడవింక నేమొ ♦ గొణుగుదువారా !
పెద్దలగతిఁ గనఁజాలక
మొద్దుగ వర్తింతువెట్లు ♦ ముక్తిలభించున్. ౧౦౬

క. పాపముఁ బుణ్యము రెంటిని
బాపటగాఁ జేసిమధ్యఁ ♦ బాడుచు రాఁగన్
బాపమను బండ గొలుసే
కాఁపురమునకీడ్చుఁ జక్ర ♦ గతి భ్రమియింపన్. ౧౦౭

క. మాయందు వేయిసారులు
మాయను మాటొట్లఁగల్గె ♦ మహిలోపలఁ దా
మాయనఁగఁ దోలుకొంపరె
ఛాయనుగని మెలఁగవయుఁ ♦ జాటున దొకఁడే. ౧౦౮

క. ముద్దుకుఁ బొడమియు నెదుగుచు
నెద్దులమై యలసి సొలసి ♦ యెటుపోవుటకున్
బ్రొద్దులు గడపఁగ నెంతుమొ
బుద్ధిఁగని తత్త్వమెఱఁగి ♦ పోవుట యెప్పున్. ౧౦౯

క. తప్పెవరు గలుగఁ జేసిరి?
యెప్పుడుమదిఁ గుందుకొట్టు ♦ తెలుకకుఁ బ్రాపై
నిప్పంటుకొనిన వస్తువు
తప్పక తగులంగబడదె ♦ ధరణిని జీవా! ౧౧౦

క. చెఱసాలర యీ దేహము
ముఱికిది మఱిముట్టుకొనిన ♦ మురిపముగాదా?
పరికింప నెందు సుఖమో
బరువని మదిఁదోఁచెఁ బూను ♦ పరసుఖమునకై ౧౧౧

క. ఎందుకుఁ గలిన దెలుఁగుట
మందిదిగో వాడుఁడనిన ♦ మమతయులేకే
ముందును వెనుకయు నుడిగిన
నందునుగా మోక్షమపుడె ♦ యదియే మతమై ౧౧౨

క. వినరానిది యనరానిది
కనరానిది గనఁగవలదు ♦ కష్టంబపుడా
యనవలసిన దనవలయుం
గనవలసినదానిఁ గాన ♦ గావలయుఁ జుమీ ౧౧౩

క. గతదినములు క్షేమమ్ములు
ప్రతిదిన మనుమానమున్న ♦ బఱియింపుచుఁ దా
నితరులు పరిభవ మిడుచో
ప్రతిఫల మనుభవముడించు ♦ బలుకఁగ వలయున్.

క. తెలివియె ధనమార్జించుట
నలురెట్ల ధనంబు దొరకి ♦ సంతృప్తిపడం
గలఁడేమనుజుఁడు పూనికఁ
వెలలేనిది మఱవకున్న ♦ విస్మృత సుఖమా. ౧౧౫

క. దాఁచినది కనకమో సరి
చూచెడిదే చూపుగాని ♦ చూఱకొనంగా
నే చిన్నవస్తు వందును
గాచి వసించిన మహేశుఁ గానఁగ వలయున్. ౧౧౬

క. బలిగుడులని మొదలిడఁగా
నిలువఁగ మృత్యువును మఱచి ♦ నిలచినరీతిన్
దలవంచి తాను బోయినఁ
బిలుచుట కేమవసరంబు ♦ పేర్మిం జెపుమా ౧౧౭

క. ఎందునో కల్గిన వ్యాధికి
మందును దినకున్న నెట్లు ♦ మానును మనకున్
మందిదిగో హరియనిమెదు
మందునుదినఁ బాపరుజ స ♦ మాజము వాయున్.

క. కొంగునఁ దనసుతు మలపూ
బంగారమె కడిగి యెత్తి ♦ బయలను నిడుచున్
వంగియు లేవని వృద్ధుల
మొంగిలి చొల్లనుచుఁ దిట్ట ♦ హేయమె మీకున్.

క. పడఁతుల చెలిమిని మానక
నడచిన ఫలమొందకుండు ♦ నా యెప్పుడైనన్
కడగండ్లెవరికిఁ దప్పవు
వడిఁజాపిన కరము ముడువ ♦ వలదేజనముల్ ౧౨౦

క. అక్షరము లనెడి గుబురున
పక్షిగతిని నిఱికికొన్నఁ ♦ బరికించరుగా
రక్షక నీకృపఁ గనుఁగొని
రక్షించవె తండ్రి యన్న ♦ రక్షింపవొకో ? ౧౨౧

క. బొందకు బెల్లము నిడునా
ముందెఱుఁగఁడు చీమలుండు మూఁగి యటంచున్
సందేహించును బిమ్మట
ముందెఱిఁగిన శంకలేక ♦ ముదమొందుఁగదా ?

క. కలదుర పలుకునఁ గర్మము
పలుకెఱిఁగినఁ బొల్లులేక ♦ పలుకుంగానా
పలుకులు వేయేటికిరా
పలుకుము హరినామమింకఁ ♦ బలుకంపగురా ౧౨౩

క. చెట్లకు జీవము లేదా
కొట్టకు పాపంబనంగఁ ♦ గొఱకొఱయేలా ?
జుట్టును గొరిగిన మంగలి
మట్టును నూడ్వంగ శుభ్ర ♦ మంతియెగాదా ౧౨౪

క. ధనమార్జింపం బూనుచుఁ
దనువదరఁగ మోదిగ్రుద్ది ♦ తన బొంకునుదాఁ
గనకుండిన మానవులిలఁ
గనుఁగొందురె యీశ్వరుని సు ♦ ఖంబు లిఖింపన్.

క. ఉపకారికి నుపకారం
బిపుడెఱుఁగని నరుఁడు గలఁడె ! ♦ యెఱిఁగియు లేకో
యుపకారికి నపకారము
తపసులకును జేయఁదగదు ♦ ధరణిని జీవా ! ౧౨౬

క. తొలిపలుకే నారాయణ
తెలియఁగ రాదన్యమెల్లఁ ♦ దెలియఁగనీకుం
దెలిసినవారే నుడువుట
సులభంబుగఁ దెలిసెనింక ♦ సుఖముర జీవా ! ౧౨౭

క. తలఁచని మనుజుల కెట్టులఁ
గలుగునురా ముక్తి ? ముక్తి ♦ కలిగెను దనుకన్
దలఁపెడను గాక యుండకన్
గలవర పడవలయు ముక్తి ♦ గలుగును దానన్.

క. ఎన్ని దినంబులు కాయము !
నన్నెఱిఁ బరిశోధనంబు ♦ నలిఁ జేయుచుఁ దా
నన్నిటి నున్నఁగఁ దలఁచిన
నెన్నఁగ దైవంబు గలిసి ♦ యెన్నిక వడయున్. ౧౨౯

క. ఏతావున భువివారియు
నేతావున నగ్నివాయు ♦ వెసగును గగనం
బేతావున నివియుండవో
యేతావున నీవులేవో ♦ యెఱుగుము దీనిన్. ౧౩౦

క. అబ్బనఁగా ములువిఱిఁగిన
నబ్బురు జింతించు చుండు ♦ నబ్బలు ముల్లే
నిబ్బరము తున్కఁదెలిపెను
గొబ్బునఁ గష్టములె హరిని ♦ గూర్పఁగ జూచున్

క. ధనముండిన విధమెఱుఁగక
కనకముతో నిల్లుకట్టఁ ♦ గాఁ బూనుగతిన్
దినదినము తీరెఱుంగక
చనుదును మోక్షమున కనుట ♦ చపలత కాదే ?

క. నిందింతురంతు తెలియక
మందనుగల పశువు కొమ్ము ♦ మఱియూఁపుగతిన్
బొందిని దూషించెడు తఱిఁ
దొందర విడనాడు మెపుడుఁ దొలుత నెఱుంగన్.

క. కొడుకాశ నెఱిగియుండఁగాఁ
గుడువక తాఁగొంతకొంత ♦ కూర్చుచునుండున్
బుడమిని దేవుండిడినది
కుడుచుచుఁ దత్పదమునందు ♦ గుఱిగనవలయున్.

క. దాసులకు మోక్షమిడవా
దోసము లిదివఱకెయున్నఁ ♦ దొలఁగింపవా కో
వాసినిగని చీ చీ యని
త్రోసితివా నేను నీచ ♦ దోషినిగానె ? ౧౩౫

క. కనుసైగవెల్లఁ గలిపియు
ననువుగ మైమఱచి మనుజుఁ ♦ డాడినచో న
మ్మనుజుఁడు మానవుఁడగు నే
ఘనుఁడనుచు నుతింతు రతనిఁ ♦ గనుఁగొనికుజనుల్.

క. తనవారి దుడుకుఁదనమును
దనభుక్తికినున్న కలిమి ♦ తన్నులమఁ జెడున్
దనగుణములు దానెఱుఁగక
నినుమఱచి మదించి నిన్ను ♦ నిందించుహరీ. ౧౩౬

క. చదువండొా గురుని సన్నిధిఁ
జదువన నొక నేత్రమిద్ది ♦ జ్ఞానముజూపున్
జదువన విజ్ఞానంబే
చదివిన ఫలమూనె పరుల సంపదఁ గొాననే? ౧౩౮

క. చిలువ చన గ్రద్దకేమగు
నిల దుష్టుఁడు చచ్చినంత ♦ నింతియె యగుఁబో
పలువుర కుపకృతి చేసినఁ
బలుకందగు నతనిఁ బుణ్య ♦ వంతుండనుచున్. ౧౩౯

క. ఇరువురకు నేరముండిన
నెఱిఁగింపఁగ నీకె యెఱుక ♦ యెవ్వఁడెఱుంగున్
జుఱుకో మొరకో మఱపో
పరమాత్మా నీకెయెఱుక ♦ పరులెఱుఁగుదురే? ౧౪౦

క. నాటకమన బూటకమే
మాటలలో నిమిడియున్న ♦ మంత్రంబదియే
యేటికి నాడెదరట్టులె
కూటస్థుని గాంచలేని ♦ కొంటెలు పెలుచన్. ౧౪౧

క. తినరానిది రుచ్యంబగు
వినలోపల శంఖమూఁద ♦ వినఁజాలరుగా
యనుభవానమునకు వైద్యము
వెనుకాడని యత్నమొకటె ♦ పృథ్వీస్థలిలోన్. ౧౪౨

క. కనుఁగొానవలెఁ గనరానిది
కను పించిననాఁకలియును ♦ గనఁబడకుండున్
పనిమాల భ్రమను నెట్టుచు
మనసునఁ దెలియంగ వలయు ♦ మతినిశ్చలతన్.

క. దుష్టుండని బుధులెల్లరు
నిష్టముతోఁ బలుకఁ జేసితి ♦ నిఁక గతియేమో
స్పష్టముగ నీదుకృపచే
దుష్టత్వము వాపుకొందు♦దురితము దొలఁగన్. ౧౮౪

క. పిచ్చిగ మాటాడకు మది
వచ్చిన విధముగను బల్క ♦ వచ్చునె జనముల్
హెచ్చుగఁ గూసిన నగునే
ముచ్చట పడవలయునన్న♦ముక్తియు దొరకన్. ౧౮౫

క. సారముగల దీగ్రంథమె
సారంబెచ్చుగ లభించు ♦ సంసారికిఁ దా
సారంబును నీవిడకయె
సారం బేమూల దొరకు ♦ సంసిద్ధముగాన్. ౧౮౬

క. శిరమందిడుకొన నేదియొ
త్వరపడకయె నిల్పినట్లు ♦ తత్త్వము నిష్ఠం
బరికించు మంతమాత్రనె
పరమంబున కెడముగాక ♦ పట్టఁగవచ్చున్. ౧౮౭

క. అన్నిటిఁ బరమాత్మునిగా
నెన్నుము హరిలేని పుడుక ♦ నెటగాంచనగున్
గన్నులుగల జంతువులకు
నున్నదియన నమ్మకంబె?♦యూఁపెదు శిరమున్ ౧౮౮

క. కోటిని వ్రాయఁగ నందఱు
నోటన పదియేనునన్యో ♦ నోపికఁబడఁగా
మోటుల కెల్లను మెండుగ
మాటలువడు సుకృతమెపుడు♦మహ్మాటికిలన్ ౧౮౯

క. జ్ఞానేంద్రియముల వెనుకం
గానఁగ లేకుండ సభలఁ గాంచఁగ నగునే?
తానింటఁ గొంత తెలిసియె
తానేగఁగవచ్చు సభకు ♦ ధర్మము చెప్పన్. ౧౫౦

క. నీకొఱకే నేడాఁచఁగ
నేకడకో చేసియున్న ♦ నేమందునురా
నీకుండిన నాకుండును
లేకుండిన లేకయుండు ♦ లేశంబైనన్. ౧౫౧

క. తనపుత్రులఁ బోషింపఁగ
జనకుండు పదార్థములను ♦ సమకూర్పంగా
జనని కుమారుల సాకఁగ
జననింగని జనకుఁడెగడఁ ♦ జనునే మనకున్. ౧౫౨

క. గ్రుడ్డిని గుఱిఁ గనుఁగొనుమన
నడ్డెగఁ గనుగాని చూచు ♦ నే మెటులైనన్
బిడ్డలఁ బురుషుఁడు పెంచునె?
దొడ్డగ సతి పెంచునట్లు ♦ తోరపుప్రేమన్. ౧౫౩

క. పొరపాటు పడిన వెంటనె
సరిగాదని పల్కుఁగొఱక ♦ సరియగునొక్కో
పొరపాటునకుం జింతిలు
నరుఁడే పరమార్థమును ఘ♦వంబుగఁ గాంచున్. ౧౫౪

క. కోపము వచ్చినఁ దొందఱ
కోపంబిడి కొట్టకుండ ♦ శాంతంబూనం
గోపమ్ము వోవు శాంతముఁ
గోపంబును నెఱుఁగువాఁడె ♦ కోవిదుఁడనఘా. ౧౫౫

క. పెఱపంచలఁ దాఁదూఱుచుఁ
బఱుఁగదిసిన కాంతఁగూడఁ ♦ బఱువెత్తుదురే
ధరనెవని మోఁతవానికె
దరిఁజేరదఘంబుజ్ఞాని ♦ ధన్యుఁడుగానన్. ౧౫౬

క. ఎటువంటిది పోకనఁదగు ?
నటువంటిది దిద్దవచ్చు ♦ నెవ్వారైనన్
దిటమెట్టులున్నఁ గల్గునో ?
పటుతరముగ నెఱుఁగువాఁడె ♦ పరమునిగాంచున్.

క. అలిఁగిన మతిచలియించెడు
నలుఁగక యుండిన స్థిరత్వ ♦ మందఁగనౌనా !
నలువురతో నారాయణ
యలిఁగిన యట్లుండి యలుఁగ♦కన్యులమీఁదన్ ౧౫౮

క. సత్యము నిత్యము నిజమా ?
సత్యంబే సత్యమండ్రు ♦ సత్యంబెప్పుడున్
సత్యమె సామికి నామము
సత్యముతోఁ బొందవచ్చు ♦ సన్మార్గంబున్. ౧౫౯

క. వెన్నను గలసిన కారము
గన్నుల కంటించినట్లు ♦ కనఁబడు సుఖముల్
క్రన్నన నవి తొలఁగిననే
యున్నత మార్గముఁ బొందు ♦ నుర్విజనులకున్ ౧౬౦

క. పట్టెడు నిద్దుర సనుటకు
బట్టుగఁ బ్రణవంబుఁగోరి ♦ పఠియింపఁదగున్
దిట్టమగు జ్ఞానమబ్బును
బట్టనగున్ ముక్తికాంత ♦ పాణితలంబున్ ౧౬౧

క. అడుగని దమ్మయుఁ బెట్టదు
గడుసు దనంబునను ♦ బరులఁ గదిసి యడుగరా
పడియుండ వలయు గురువుల
నడిగి పరార్థంబుగాంచ ♦ నగునో జీవా! ౧౬౨

క. తనువెనుక మేనుజూపక
యనుమానములేక యెల్ల ♦ నయ్యాదిగుణమహా
ననినట్టు లాచరించిన
మనుజుఁడె ధీరుండు బుద్ధి ♦ మంతుఁడుచూడన్ ౧౬౩

క. దొంగతనమేల మదిలో
నంగల దున్నట్లుపల్కి ♦ నన్ లోపంబే
వెంగలి యందురె యైనన్
సంగతి గుఱుఁ తెఱుగవచ్చు ♦ సజ్జనమైత్రిన్. ౧౬౪

క. బసవనికి గంట కట్టుట
వెసఁబాములబాధ తొలఁగు ♦ విధమున కేకా
దసదృశ ప్రణవధ్వని విన
దొసఁగుల విడనాడు ముక్తి ♦ దొఱకునుజుమ్మీ. ౧౬౫

క. అడుగుట నాదియెసొడ్డా?
యడిగిన లేదనక యొసఁగు ♦ నార్యులులేరా?
యడిగి తినువాఁడె ధన్యుం
డడుగక తెగనీల్గువాఁడె ♦ యధముఁడుజీవా! ౧౬౬

క. అన్నము దిన నేర్వనిచో
నెన్నఁడుఁ గఱవేదిజ్ఞాని ♦ కితరులతోనే
మున్నదిపని యొంటరిగాఁ
బన్నగ శయనుని దలంచి ♦ పరమును గాంచున్. ౧౬౭

క. కని కొన్ని కనక కొన్నిటి
ననుభవమునఁ గొన్నినీతు ♦ లవనిం జెప్పెం
గనులున్ వీనులు దనియఁగ
వినుబవనం వీరయాఖ్య ♦ విబుధుండాస్తన్. ౧౮౦

క. వినుము మహాత్మన గొప్పది
జనులు మహాత్మనుచు లోక ♦ సంబంధముగా
ననుచుంద్రు మహాత్మనఁగాఁ
జనును బరాత్పరుని సృష్టి ♦ జాలంబునకున్ ౧౮౧

క. కలమాట లెల్ల వేమన
కలియుగమునఁ జెప్పెనబ్బ ♦ కడు ముదమొదవన్
బలుగాకులు బాగుపడం
గలరని యతిశ్రద్ధఁజదువఁ ♦ గావలయు జనుల్ ౧౮౨

క. పరుల ధనంబును బెల్లఘు
కరణిందినఁ గోరుచుంద్రు ♦ కందులుఁ దంద్రుల్
నరులాగతిఁ దినఁగోరుట
నరకంబునఁ గూలుటగును ♦ నమ్ముడు జనముల్ ౧౮౩

క. నీపనికై చనుదేరఁగఁ
బాపులు సంకోచమొంది ♦ ప్రభువుల ప్రాపుం
దీపింపఁజేయుఁ జేబుల
నోపిక గాలింతురయ్య ♦ యుర్వీస్థలిపైన్. ౧౮౪

క. కరమునఁ దాఁగఁ రమిడియా
సరిలెమ్మని పలికి పిదప ♦ సరివడకుంటన్
దరికొదిగి వణఁకువాఁడా
నరులంటని వాఁడు మాల? ♦ నరుఁడరయంగన్ ౧౮౫

క. ధనమొక్క పైసనిడఁగా
వెనుకాడక వేయిచెప్పి ♦ వెళ్లుదుననఁగా
ననుమానమె పెద్దమ్మకుఁ?
గనుఁగొనఁగా నాలిముచ్చు♦గంతలు గట్టున్. ౧౮౬

క. ధనముదిగా మిత్రత్వము
ధనహీనతఁ గలుగు దుఃఖ ♦ తతి లోకమునన్
ధనహీనుఁడు వ్యర్థుఁడగున్
ధనమును బోఁగొట్టఁదగదు ♦ ధరలో మనుజుల్. ౧౮౭

క. కోసి తెచ్చిన పానీయమె
తనువునకు సుఖంబునిచ్చు ♦ దగఁగోరికతోఁ
గొని తెచ్చు పాడిగేదెయె
ఘనముగఁ బాలిచ్చుమేని ♦ కండలఁబెంచున్. ౧౮౮

క. అధిక వ్యయ మొనరించుట
యధికముగాఁ దినుట మఱియు ♦ నధికపురతియున్
అధికాలాపము లాడుట
యధికారంబూడఁజేయు ♦ నధికుల కెన్నన్. ౧౮౯

క. పేకాటయె వ్యసనంబది
తేకువ నిద్దురను జెఱచుఁ♦దెగడు సకలమున్
జీకాకు నొసఁగు నిహపర
లోకంబుల సుఖముమాపు ♦ లోకులకెపుడున్. ౧౯౦

క. కూటికి నేఁగిన శునకం
బోటి ఘటము మూతి మెడకుఁ నురిగాఁబడఁగాఁ
జోటెఱుఁగక పరుగెత్తును
మాటికి నరుఁడట్లె తిరుగు ♦ మాయంబడుటన్. ౧౯౧

క. చెడ్డదియని చెప్పుచునే
దొడ్డగ నొనరించు చుంద్రు ♦ దుష్టులు దానిన్
గడ్డిదిను గొడ్డు గొడ్డా?
సొడ్డెఱుఁగనివారెసూ వ♦సుంధర యందున్ ౧౯౮

క. సరసంబుగ ధనమడిగిన
నరువునకే విడుచునంట ♦ నర్థులకిడినన్
జరుగదంట పరమునంద
క్కఱకగునది దానధనమె ♦ కనలేరకటా! ౧౯౯

క. చెడుగునకు నెంత చెప్పిన
విడువఁడు తనమూర్ఖమెంత ♦ వెకలియొ యకటా!
చెడిపోయిన పాకంబును
విడువఁడె తినరోగ మొదవు ♦ విధముండుటచేన్. ౨౦౦

క. అడుగుట ధర్మమె యట్టుల
నడుగుటకుం బూర్వమెఱిఁగి ♦ యర్థులకర్థం
బిడుటయె త్యాగ గుణంబగు
గడుసుఁ దనంబునను నీక ♦ కడుపుట మేలే? ౨౦౧

క. వేలకొలఁది నాలుండియుఁ
బాలీయక యున్నవాని ♦ ఫలమేమటులన్
వేలార్జించియు నర్థుల
కీలేని ధనాఢ్యుద్రవ్య ♦ మేటికి ధరలోన్. ౨౦౨

క. దొడ్డగునీ ఘనమనుకొని
బిడ్డగ నిన్నాదరించి ♦ పేరిమితోడన్
గడ్డమునఁ గరము లుంచిన
నెడ్డెతనంబునను ద్రోతు ♦ వేలర బుడుతా! ౨౦3

క. ఇడుమనఁగా నిడఁబగినది
పుడమి నిడినఁదినగ నడుగఁ ♦ బోలును యాసం
గడుదుస్తరమగు నాసను
విడనాడినవాఁడె ఘనుఁడు ♦ విశ్వముఁలోనన్. ౨౦౪

క. దీనుఁడయి తన్ను వేడిన
వానికి నర్థంబు లీక ♦ పంపందగునే
జ్ఞానము ధనముంగల వి
జ్ఞానికి దాతృత్వ గుణము ♦ గల్గినమేలౌ ౨౦౫

క. బొంకని మానవుఁ డుండిన
వంకర వానికిని గూర్చ ♦ వత్తురుగానీ
శంకరుఁడు ప్రక్కనుండఁగఁ
గుంకలచే నేమి యగును♦గుశలము నందున్. ౨౦౬

క. తిట్టకుము దైవభక్తులఁ
దిట్టకునినుఁ గన్నవారి ♦ దీనుల నెపుడుం
దిట్టకు మెవ్వరి నైనను
దిట్టుట మానంగవలయు ♦ దృఢచిత్తమునన్. ౨౦౭

క. అయ్యోడి కార్యముఁ జెఱపకు
మయ్యా! బతిమాలు కొందు ♦ మనఁదోలఁగుమురా
వెయ్యేఁబడు విస్తారాకుం
దియ్యం దగునయ్య? యెట్టి ♦ ధీరులకైనన్. ౨౦౮

క. శునకమున కేమి చీయనఁ
దినుచుండును బయలుపీడు ♦ తిండిని నటులన్
ధనమునకు నాస చెందియె
జనులే కార్యంబులైనఁ ♦ జలుపుదు రోర్మిన్ ౨౦౯

క. ఆఁకలిఁ బాసఁగ నుంచియు
నీకడఁగల చింతఁదెల్పి ♦ నేనుపు తోడన్
నీ కన్న కొడుకు గాదని
యేఁడద పంపెదవు ద్రవ్య ♦ మీయక యర్థిన్ ౨౧౦

క. బిడ్డల్లు దొరకక యెండలో
కయ్యమునకు సిద్ధపడిరి ♦ కలియుగమందున్
దయ్యంబైనను వారల
కుయ్యాలిం పండులంప ♦ గొండు ప్రాహై. ౨౧౧

క. తనగుణ మెంచక కుంమను
దనయాంగ్లి పరులకుంచుఁ ♦ దగఁదెలియంగాన్
దనరూపె నిత్యమంతయు
నని తెలిసినవాఁడె జ్ఞాని ♦ యవనీస్థలిలోన్. ౨౧౨

క. తనకార్యమె కార్యంబగుఁ
దనశిశువే తనకుముద్దు ♦ ధనమూఘులకున్
దనబాగెబాగు నిహమునఁ
దనకగు మోసంబు పరముఁ ♦ దప్పక చెఱచున్. ౨౧౩

క. కఱవేమివచ్చెఁ బేదల
నరసియు భీప్సితముదీర్ప ♦ వశ్యాత్ముండై
కరములు నీకిడుటకు ఘ
మొరులకు దానంబు వేయు ♦ చుంటకుఁగాదే? ౨౧౪

క. నీచులు నీచుండనినను
దోఁచిన మానవులు నన్ను ♦ దొడ్డగననినన్
ధీచతురత సమకుగఁగొని
చూచుచు మోక్షాధికారిఁ ♦ జూడఁగ వలయున్ ౨౧౫

క. వెనుకన్వేమన యోగికిఁ
గనఁబడి నావనుమఁజెప్పఁ ♦ గా విని నిన్నుం
గనుఁగొన వేఁచితి నైనం
గనులుండియు గ్రుడ్డినైతిఁ ♦ గనరావుగదా! ౨౧౬

క. ఒప్పగరు న్యాయమూర్తియె
తప్పును దెలుపంగవచ్చుఁ ♦ దగనన్యాయమున్
జెప్పఁడిను శునకములా
యొప్పులఁ దప్పులనుదెల్ప ♦ నుర్విస్థలిలోన్. ౨౧౭

క. అనుభవ మెవ్వనికందునొ
యనుభవమన నాకుఁ దెలుఁగు ♦ నహ్యలకనునే
యనుభవమున జ్యోతింగనుఁ
గొని తనువాఱవంగఁ జేయు ♦ గుణమేసుమిత్రా. ౨౧౮

క. వేఱుపడ నేమిచెఱుపగు
వేఱును గోరంగ శుభమె ♦ వెలయును జగతిన్
వేఱగు లోకస్థులలో
వేఱగుటను వెఱచుఁ బరుని ♦ విధనము గోడన్ ౨౧౯

క. ఎత్తిన జన్మము లెన్నియొ
మొత్తము చెప్పంగరాదు ♦ మును గాని పసనిం
జిత్తమున హత్తి జన్మము
లెత్తని విధమెఱుఁగు గుణజ ♦ నేలుల మనాన్ ౨౨౦

క. మనసా! నారాయణ పద
వనజాంబుల నిలుప మరణ ♦ భయముండదికన్
జనిపోక యుండ దెద్దియు
ననువగానము మాను జ్ఞాని ♦ నగుమికనైనన్ ౨౨౧

క. నిన్నటివాఁడే భానుం
డెన్నఁగ నీదినమువచ్చి ♦ యేఁగునుగాదే!
ఎన్నఁటికిం జెడఁడు జీవుఁడు
పన్నుగ జన్మంబునెత్తె ♦ భయపడనేలా ? ౨౨౨

క. తేనియ చక్కెర పండులు
మానక తినుచున్ననెట్టి ♦ మానవుఁడైనం
బూనిక దాహమునకు నీ
రానఁడె? పరమార్థమొకఁడె ♦ యాపదఁబాపున్ ౨౨౩

క. అనుకొనని దగును గోరిక
ననుకొనినని కాదు జనుల ♦ కవనీ స్థలిలో
ననుకొనుట యే విధులను
మనసున ఫలకామికాక ♦ మఱిఁజేయఁదగున్. ౨౨౪

క. రేపేమొ యెఱుఁగుమనఁగా
రేపింకేమియును గాంచు ♦ రేపెటులరా ?
రేపనకు చాలదూరమె
రేపను శబ్దంబెముంచు ♦ రేయుంబవలుం ౨౨౫

క. గురుతందిన గుణమేమా ?
గురుతందిన ముక్తిచింత ♦ కుదురదు సుమ్మా
గురుతందిన మహనీయా ?
గుఱుతును బట్టంగవశమె ♦ గురువులకైనన్ ౨౨౬

క. కడసారి జన్మమనఁగాఁ
గడతేఱెడి విధమదెద్ది ♦ కనుఁగొనవలదా ?
చెడిపోక పిరికితనమున
వడివడిగా పడవనెక్కి ♦ పారము గనుమా ౨౨౭

క. తనభాష తనకుఁగాదా
తనభార్యయె తనకుఁజుమ్మ ♦ తగవిక నేలా
తనమతమె మతముగానీ
పనిపడ వితరంబులెన్నఁ ♦ బరమున కెప్రదుఁ ౨౨౮

క. కనుఁగొనుఁడి భక్తిరసమని
కనుగొలుకుల నీరుగార్పఁ ♦ గనగారడియా
జనులెల్లఁ గీర్తికాంక్షను
మనసున విడలేరుముక్తి ♦ మార్గంబసదే? ౨౨౯

క. ఎగిరినయెద్దే గంతను
దగమోయు నటన్నసామె ♦ తగఁ జిరకాలం
బెగిరితిని గూలఁబడితిని
భగవంతుని జూడఁగనని ♦ పతితుఁడ నైతిన్ ౨౩౦

క. చావెవరు నెఱుఁగఁబోరిలఁ
జావట దైవంబువలనఁ ♦ జాలఁగ వెలసెన్
జావెఱిఁగిననా మీఁదటఁ
జావునకున్ ముదమునొందు ♦ జ్ఞానిసిరీహన్. ౨౩౧

క. వేగిరపడఁగా దేదియు
వేగిరపడఁకున్నఁ బోదు ♦ వీసంబైనన్
వేగిరపడుచో సూర్యుఁడు
సాగునె తొందరగఁ గ్రుంకఁ ♦ జనునే యెచటన్ ౨౩౨

క. తెఱచాటు బొమ్మలాటగఁ
బరికించియుఁ బరముగనఁగఁ ♦ బఱియుంచియునీ
నరజన్మమెత్తి చివఱకు
నరకంబునఁ బడఁగనీమ ♦ నం బెటులొప్పెన్ ౨౩౩

క. తెలివి కొఱవడియునప్పుడు
తెలవాఱుచు నుండుటగుదె? ♦ తెలవాఱునుగా
తెలివి నశించినయప్పుడు
తెలవాఱుట తనకుఁ జుమ్ము ♦ తెల్లముగాగన్ ౧౩౪

క. చదువునకున్మా దలుండును
జదువునకుం జివఱలేదు ♦ చచ్చెడుదనుకం
జదువుటయే చాలించుట
చదివితిని గర్వమూనఁ ♦ జనదెవ్వరికిన్ ౧౩౫

క. మాటకె యొదుగు కేఁగిన
మాటయె మాఱిలేకయున్న మానుబెట్టులరో?
మాటలను దూఁచిపొందిక
మాటాడఁగవలయును జనుల ♦ మన్ననలొందన్ ౧౩౬

క అరయక నిజమాడితినని
కలవఁగాఁ బూనుకొనును ♦ గల్మషమేమో!
పలుకంగని శునకంబులు
కలవం దొడఁగొన భాతి ♦ గర్వము తోడన్. ౧౩౭

క. వేదంబన నగుచుంటకు
వేదాంతులమనుచు సతము ♦ విధవలు పెలుచన్
వేదాంతివిధవ కడుపున
నెదిరియొ యొక బుడుతఁ దగ్గి ♦ యేఁగఁగ వలయున్ ౧౩౮

క. బిడ్డలఁగనుటయె కొడుకు
బిడ్డలకున్ బుద్ధి చెప్పి ♦ పెంపఁగవలయున్
బిడ్డలకున విజ్ఞానము
యిడ్డంపులు లేకొంచుఁ ♦ డంపలుకానిన్ ౧౩౯

క. పురుషుఁడె మీసంబుండినఁ
బురుషుండగు సజ్జనుఁడగుఁ ♦ బుట్టినవాఁడే.
పురుషుఁడు పురుషుఁడనఁగాఁ
బురుషునిఁ గనలేనివాఁడు ♦ పురుషుండగునే. ౨౮౦

క. విధవలు వేదము వినఁగాఁ
గ్రుధఁజెందఁగనేల కాకలఁ ♦ గొట్టఁగనేలా ?
విధమెఱుఁగు సత్యులందఱు
వ్యధనొందక దైవవాక్కు ♦ లందింపఁదగున్. ౨౮౧

క. సన్న్యాసి కార్యమసదే ?
సన్న్యాసికి సుఖతాపము ♦ సన్మార్గమునన్
సన్న్యాసి వఁటునిజమే
నన్యాంబిక నేను చెప్ప ♦ సంతసు వాదిన్. ౨౮౨

క. రేపటిదినమున నెయ్యది ?
చూపింపఁ గలారయెట్టి ♦ శ్రోత్రియుడైనన్
రేపనక నేఁడె యున్నియుఁ
బాపుము నినుముంచుఁగర్మ ♦ బంధములెల్లన్ ౨౮౩

క. జీవుఁడు తేరగనెట్టుల
దేవుండగు సత్కృతులకుఁ ♦ దెలివియుఁదోడై
నీవెంట నుండసాధనఁ
గావింపఁగ వలయుగుమతి ♦ కరుణాసతంబున్ ౨౮౪

క. ముక్తియను నమృతమును నా
సక్తిని గ్రోలంగఁ గలుగు ♦ సజ్జనులకునే
రక్తియు నుండదు ప్రకృతిరి
సక్తవతెందోఁచుపొక ♦ సౌఖ్యములెల్లన్ ౨౮౫

క. చూచెడి ప్రపంచమంతయుఁ
దోఁచును గంటకమురీతిఁ ♦ దొడరి బిడాలం
బేచందంబున నుండునో
యాచందంబునను మృత్యు♦వరయుచు నుండున్ ౨౮౬

క. నడువడిసరిగా వలయును
గుడిచియుఁ గూర్చుండి చెడుగు ♦ గుణియించుటయా
పుడమిని నుడివెడికథలను
గడుచోద్యం బేమిచెప్పఁ ♦ గలలనవలయున్ ౨౮౭

క. ఎదియిచ్చట శాశ్వతమగు
నిదియదియను భేదమేల ♦ యిరవెఱిఁగినవా
రుదితదయన్ వేదంబును
బదిమందికిఁ జెప్పవలయు♦స్వరయుక్తముగన్ ౨౮౮

క. ఒకనికి మిగులొక్కండని
యొకనికి నెదురుగను నిలిచె ♦ నొక్కండని యా
రకపలుకు చుందు రెఱిఁగిన
నొకటికినిను జేర్చునద్ది ♦ యొనరంగనుమీ! ౨౮౯

క. అద్దలకొంపర దేహము
పెద్దవుగానుండి విన్నఁ ♦ బెనుసుక మబ్బున్
బెద్దలు నినుదొంగయనన్
వద్దుర కోపంబిదెపుడొ ♦ వదలఁగ వలయున్. ౨౯౦

క. కావరమున మాహాత్మ్యులు
దేవుఁడు వాఁడేయటన్న ♦ దేవుండగునా?
నీవంతరమున నారసి
దేవుని కనిపనులకద్ది ♦ తెలుపఁగ వలయున్. ౨౯౧

క. ముప్పది రెండక్షరములు
చప్పనయగు వర్ణనములఁ ♦ జనునయ్యదియే
యిప్పుడగుఁ బంచదారగఁ
జెప్పఁగ మితిమెఱఁగియున్న ♦ జెడవెప్పటికిన్ ౨౫౨

క. బరువనదు గార్దభంబది
మొఱుఁగుటకే శునక మొప్పు ♦ మొఱఁగినచో నా
ప్పరికించునె గాడిద న
ప్పరమాత్మకె తెలియునంచు ♦ బరికించుఁగదా! ౨౫౩

క. బ్రహ్మ లిఖించిన వ్రాఁతను
బ్రహ్మయె చదువంగవచ్చు ♦ బ్రతికెదునాసన్
జిహ్మగడగుటది మేలా ?
బ్రహ్మనొసట వ్రాసినట్లు ♦ బ్రతుకును నరుఁడున్ ౨౫౪

క. బుద్ధిజనించినఁ దనువగు
బుద్ధిజనించిన ధరిత్రిఁ ♦ బొందును సుఖముల్
బుద్ధిజనించిన యప్పుడ
బుద్ధపరాత్పరుని గాంచి ♦ పొందును ముక్తిన్ ౨౫౫

క. మాటలఁ గాలముపుచ్చెడు
మాటికివ్యర్థుండు ధనిక ♦ మండలియెదుటన్
ఘాటిగనోయన నిలుచును
మాటలచేఁ గాదె వారి ♦ మన్ననలందున్ ౨౫౬

క. అందముగు రెండు ఫలములె
డెందంబే కాగ్రమగుఁబ ♦ టిష్ఠాత్ములకున్
పందలకు మూఁడు ఫలములు
తొందరపడకుండఁ దెలియఁ ♦ దోఁచదె మదికిన్ ౨౫౭

క. మాటలకే చింతకాఁడులు
మాటలకాధనమొ ఫలమొ ♦ మానెడువట్లో
మాటలకు ముక్తి దొరకదు
మాటకునై స్థిరుఁడవగుము ♦ మాన్యతతోడన్ ౨౭౦

క. తాతది గడసాస్మ్రంతయు
తాతదికన సొమ్మటన్న ♦ దాఁచినఁనగునా
తాతకుఁ ధనమును భేదము
వేతొలఁగిన ముక్తినొంద ♦ విధమేర్పడురా ౨౭౧

క. తాతయె లేతగ బ్రహ్మము
నేతగ శివుఁడయ్యెఁ దండ్రి ♦ నేర్పించినయా
తాతకు ననుమఁడవీవా ?
జీతముగొని చేయునంట ♦ చెల్లునెనీకున్ ౨౭౨

క. తాతదిసొమ్మను ధరలోఁ
దాతయుమఱి విత్తనాలు ♦ తానాటంగాఁ
దాతలబరువని తెలిసియె
మోఁతను నీ వొప్పుకున్న ♦ మోక్షంబగురా ౨౭౩

క. తాతది జీతమెకనుఁగొనఁ
దాతకుని.క జీతమనుచుఁ ♦ దానను కొనుటా
దాతల ముప్పూర జీతము
నీతిగ సేఁకనలదటన్న ♦ నిత్యము దక్కున్. ౨౭౪

క. కడుపునఁ బెట్టఁగఁ దలఁచియుఁ
బుడమినదా నడుగఁడొల్లు ♦ పొరపాటగునా ?
పడుపాటు కష్టమునిగద
యడుగుట యన్యాయమగునె ♦ యధముఁడనైనన్ ౨౭౫

క. సిగ్గున్నది మొలయందా
సిగ్గున్నది యఱుగునంద ♦ సిగ్గెందయ్యా!
సిగ్గది నోటనఁగన్నుల?
సిగ్గున్నది దేహమెల్ల ♦ సిగ్గునవినుమా! ౨౭౬

క. ఒడలెఱుఁగనంట న్యాయమె?
యొడలెంతో నొచ్చెనందు ♦ వొడలెఱిఁగితివా?
యొడలెఱిఁగినంత శంకరు
నొడలెఱిఁగి పరంబుసౌఖ్య ♦ మొందేకనరా! ౨౭౭

క. శత్రువు తనువైమఱల్గ
శత్రువు జీవాత్మయయ్యె ♦ జనులకునెల్లఁగ
మిత్రుఁడె తనువైమఱలన్
మిత్రుఁడె జీవాత్మయయ్యె ♦ మేలొనఁ గూర్పన్ ౨౭౮

క. భయముడిగినఁ దనువందా
భయముడిగెను బ్రజలకమిత ♦ భయమిఁకఁదీరెన్
భయముడిగినఁ బ్రాణులకును
భయమేటికిఁ బాపచయము ♦ భయపెట్టదయా! ౨౭౯

క పొడముట పొద్దునకేనా?
పొడముట జంతువులకేన ♦ పొడమును జగముల్
పొడమని ప్రాణిశివుండే
పొడమని పరమాత్మఁగన్నఁ ♦ బొడమదఖిలములన్ ౨౮౦

క. నారాయణ యననందమె?
నూఱేండ్లు జపింపవలయు ♦ నోరూరంగన్
గోరఁగవలయును మితమా?
పారముగనుదాఁ కఁజలుప ♦ వలయున్ జపమున్ ౨౮౧

క. ఈకార్య మెంతవఱకో
నీకార్యమె యపస్తుపడఁగ ♦ నీకనుమానం
బాకార్యము విడనాడక
శ్రేమతోఁ జలుపము క్తి ♦ తెలివెలుఁగఁదగున్ ౨౮౨

క. మానవునకె విషమంతయు
మానవులా కాదు దుంభి ♦ మానులు దుష్టుల్
మానవుఁడు విఱుఁగఁబడు న
మ్మానవుఁడేకర్మజాల ♦ ముగ్నుఁడు సుమ్మీ ౨౮౩

క. పెద్దతన మొకని దేలా ?
పెద్దగనొక మున్పురున్నఁ ♦ బెద్దవుగాదా ?
పెద్దకుఁ జిన్నకు నైనను
సుద్దుల నేర్పంగ వలయు ♦ శుద్ధాత్మండై. ౨౮౪

క. తనువుండఁగ సుఖమెట్టులు ?
తనువును గలపించుఁగోరఁ ♦ దను నెఱిఁగించున్
దనువునకె కష్ట సుఖములు
జననము లేకున్నఁగలుగు ♦ సకల సుఖంబుల్ ౨౮౫

క. రుచులన్నిటి దిగఁద్రావఁగ
రుచి యొక్కటి వెంటనంట ♦ రుచి గలియంగా
రుచు లేమి తెక్కపరము న
రుచిగలదని తెలిసికొన్న ♦ రూఢాత్మనమున్, ౨౮౬

క, జపియించ ప్రయత్న సతతము
క్రొన నారాయణ [illegible] ♦ [illegible] నేలా ?
[illegible]
దపమిమితంబైనము క్తి ♦ యపష్టప యిచ్చున్. ౨౮౭

క. బ్రతికెడి బ్రతుకొక బ్రతుకా?
బ్రతికియె పోవంగ వలయు ♦ బ్రతుఁగఁగమున్నా
బ్రతుకెఱిఁగి మానవుఁడు తా
బ్రతికిన బ్రతుకఁగవచ్చు ♦ బ్రతు కెప్పటికిన్. ౨౮౮

క. బెదరింపఁగ నెవఁడని తా
మది సిగ్గును గలిగి వెళ్ళి ♦ మది తెలియుంగన్
బెదరింపఁగ నెవ్వఁడురా
బెదరింపులలోనఁ జొచ్చు ♦ బెదరింపకుమా! ౨౮౯

క. గుఱుతును బొందఁగ ముందుగ
గుఱుతుగ నక్షరము నెఱిఁగి ♦ గుఱినిల్పవలెన్
గుఱుతిడఁ జాలిన యపుడే
గుఱుతగు దైవంబుగన్న ♦ గుఱుతిఁక నేలా! ౨౯౦

క. గుడిసెల నన్నము గుడుచుచు
గుడిసెల వాసముల లెక్క ♦ గుణియించుటయా?
కడపుట తగునా పూటలు
వడిజాఱఁగ నీటజెల్ల ♦ భంగిని జెడవో? ౨౯౧

క. వేధ యిడెం బుకసత్వము
గాథను జరుపంగఁ గొంత ♦ కావలెననుచున్
దాధన మిడికొను నాపెను
దాధనమును వదలకున్నఁ ♦ దాఁజెడునొక్క ౨౯౨

క. హరికథ చెప్పెదనని తం
బుర కథనే మొదలు పెట్టు ♦ హాధుండై తం
బుర కథయె చెప్పఁజాలఁడు
హరికథ యిఁక నేమి చెప్పు ♦ హరికథఁ జేకన్. ౨౯౩

క. కపటంబె మొదటినుండియు
కపటంబిఁక వీడకున్నఁ ♦ గలతలు చనునే?
కపటంపు గుఱుతు తెలిసినఁ
గపటంబిఁక లేకపోవుఁ ♦ గలరీతిఁ గనన్. ౨౯౪

క. నడకయ ముందే కలిగెను
నడుగుటకే నోరుగదవు ♦ మడిగినచో నీ
వడిగిన దొసగుఁను దాతయు
నడుగకయే చెడుదువన్న ♦ యడుగుము సొమ్మున్

క. ఋతువన ఋణమన నెపుడా
గతియనఁగాఁ బ్రాప్తమెద్ది ♦ కనఁగలిగినఁదా
బ్రతుకున ననుభవ మగుచోఁ
బ్రతివాక్కుకు బదులు చెప్పఁ ♦ బడదుర యెపుడున్ ౨౯౫

క. రూకకు మానికలైదఁట
రూకలయిదు మానికకును ♦ రూపింపంగా
నీకడుగ విసుగు లేదా!
నాకెప్పుడు విసుగు లేద ♦ నంతము దెల్పన్ ౨౯౬

క. నిజమేమి చెప్పియుంటిని
నిజమే నీకొఱకు నెదుట ♦ నిలువగనుండెన్
నిజమును దెలియక పోయెదు
నిజమే నినుఁ జూడనున్న ♦ పిలిచి యెఱుఁగుమీ! ౨౯౭

క. ఏటిని గాష్ఠంబులవలెఁ
జోటెఱుఁగక కొట్టుకొనుట ♦ చోద్యము కాదా
నాఁటికి స్వతంత్రమెఱుఁగక
సాటిగ దైవమునుగోర ♦ సాకును బొమ్మా ౨౯౮

క. వస్త్రము గట్టినదేటికి
వస్త్రము గట్టంగ మఱుఁగు ♦ వచ్చునె మనకున్
శాస్త్రంబు లన్నియును ని
ర్వస్త్రిండై పుట్టుఁ జచ్చు ♦ వాక్యమె చెప్పన్ 300

క. పొరుగింటి కేఁగియూ స్త్రిం
బరపురుషుని గలసికొంట ♦ పడఁతిది తప్పౌఁ
బొరుగింటి కేఁగి పురుషుఁడు
పరకాంతను గలసికొన్నఁ ♦ బరమెటులబ్బున్ 301

క. కులమును మగఁడును వలదఁట
కలిమికి నాసించునంట ♦ కామినిపకులం
గలసి చెడు తెగులు గల్గినఁ
గులమును దెగనాడియెపుడుఁ ♦ గుములుచు నుండున్

క. మగఁడా? కొన్నది బావయె
మగఁడే! మోహించికూడు ♦ మదమున బావన్
మగఁడు మరణింప నూరక
మగువయు నోదేవయనుచు ♦ మానక యేడ్చున్ 303

క. ఇల్లరికమంచుఁ బోవుదు
రిల్లాలు లభించుఁగూడు ♦ తృప్తిగనోరకున్
గొల్లగసౌఖ్యం బగునని
యిల్లరికముకంటె నరక ♦ మెచ్చటనుండున్? 304

క. దెబ్బను బామును దేలును
నబ్బురముగ లొంగిపోవు ♦ నైనను జెఱచున్
దెబ్బలు గొట్టెడువానికి
నిబ్బందులు గలుగుఁ బిదప ♦ వృథగానీల్గున్ 305

క. తనకే తెలియఁగఁ దగునది
తనమనికే తెలియకున్నఁ ♦ దతనుగఁ జెప్పన్
మనసునకెక్కదు కన్నన్
మనవినిగైకొన్న నిలచు ♦ ననుటయు గల్గున్ ౩౦౬

క. ఎవ్వనికిఁ గొడుకు కావలె ?
నెవ్వని కా కొడుకగల్గు? ♦ నెవ్వని కెవఁడో!
యెవ్వఁడవు నీప్రచూడఁగ ?
నెవ్వఁడు పరమాత్ముఁగనఁగ ♦ నెవ్వఁడు తగునో! ౩౦౭

క. ప్రతికందమునఁ గడమఁదికన్
బ్రతుకదు కా తనువటంచు ♦ భయపడనేలా ?
బ్రతికించు కొండె తనువును ?
బ్రతివాక్యముఁ దూచితూచి ♦ పలుకఁగవలయున్ ౩౦౮

క. గారడి చూచెద నొకసరి
గారడి శతవత్సరములు ♦ కాయంబులకౌ
గారడియని తాఁ దెలిసిన
గారడివాఁడుండి ఫల్లు ♦ కనుఁగొననయ్యెన్. ౩౦౯

క. నాలుగునెలా వేసవి
నాలుగు మాసములు లెక్క ♦ నానఁగ వర్షా
కాలము చలికాలంబిక
నాలుగునెలలన్ని కలిసినవ్వత్సరమహా. ౩౧౦

క. క్రొన్నెల కంటంబడఁగాఁ
బన్నుగ నదె నెలయటంచుఁ ♦ బలుకుదురహహా !
ఎన్నవ నెల యెన్నవదిన
మన్నా నారాయణాయ ♦ టన్నను ఫలమహా. ౩౧౧

క. అదెయాది వారమనఁగను
మొదటనె నరులన్నయట్టి ♦ మొరవినఁగాదా ?
పిదపఁగన సోమవారము
మదినెంతయు మంచిదంచు ♦ మహిజనులెల్లన్ ౩౧౨

క. మంగళవారమ్మనఁగ్గా
మంగళకరుఁడైన దైవ ♦ మహిమయె కాదా !
మంగళమన శుభకరమై
మంగళమన సిద్ధిఁబొందు ♦ మార్గమె సుమీ! ౩౧౩

క. బుధ గురువారములను నా
బుధులెంచిన గుణులఁగనుట ♦ భువిజన మెల్లన్
విధియించు శుక్రవారము
శిధిలముగా కుండమదిని ♦ జేర్పుండంచున్ ౩౧౪

క. శనివారమనఁగఁ దెలియఁగ
జనులెల్లను నొకరి కొకరు ♦ జయమని చెప్పన్
శనియింక లేదు జగమున
శనితీఱును నేటితోనె ♦ జయమగునన్నా ! ౩౧౫

క. ఋణమను మూఁడక్కఱములు
గనులెఱ్ఱఁగ జేయఁగాంచి ♦ కందములిటులం
గనఁగలిగితి శివకృపచే
ననుమానమె త్రుంచుమనఘుము ♦ వ్యాఘ్రము రీతిన్ ౩౧౬

క. మగవానిని గనుఁగొను టెటు ?
మగదియె మననొసటిగీత ♦ మగడే దైవం ?
బగపడదు కనకమిడనా ?
మగదియె గాంధీమహాత్మ ♦ మార్గము చూడన్ ౩౧౭

క. కన్నదియగవున కేఱుకయె ?
కన్నది మదికంటెపాపఁ ♦ గనఁగారణమా
గన్నది పుడమిని గాంధియుఁ
గన్నదియుగధర్మ మెఱుఁగఁ ♦ గన్నది శివుడో ३೧८

క. మనవ్రాత మనకుఁగాఁగను
దనవ్రాఁతయె తనకుఁగల్గఁ ♦ దదితరమేలా ?
మనవ్రాఁత చదువుగాదా ?
తనవ్రాత శివుండువ్రాయుఁ ♦ దథ్యంబెపుడున్ ३೧೯

క. దిక్కులు నాలుగుదెలియక
దిక్కరినై తిరిగియున్నఁ ♦ దిరమతిఁ జెపుమా
మఁక్కంటిసుతు వినాయకు
మ్రొక్కుదురిలమీఁదజనులు ♦ మోహముతోడన్ ३೨೦

క. బట్టలఁగట్టఁగ నేరిచి
పట్టెడు మెతుకుంనుఁగుడువ ♦ బ్రతుకాయెఁగదా
ముట్టఁజెడు కడవపలెఁదను
వట్టెపగులు శాశ్వతంబె ♦ యవనీస్థలిలోన్ ३೨೧

క. నిప్పుఁ పుడకను గీచినఁ
జప్పునఁజీఁకటిసఁబాపి ♦ సకలముఁగననౌఁ
జెప్పుట కేప్వకునీకడ
నెప్పుడు నీగ్రంథమున్న ♦ నెఱ్ఱిఁగించుఁగదా ! ३೨೨

క. మొన్నంగఁడిచిన కూరలఁ
దిన్నఁగనుచి చెప్పలేక ♦ తిరుగుటయేలా
మొన్నఁడో నరకంబనుచును
నన్నున్ బెదరింపవచ్చు ♦ నాగతిలేదే ! ३೨३

క. పచ్చిగనుండిన వృక్షమె
చచ్చెను మానవుఁడుఁగూడఁ ♦ జావఁడెఖరలో
నచ్చునగఁబడి యుండెదవే?
యెచ్చగమఱి యెదిగి యెదిగి ♦ యిలననఁగుఁజుమీ

క. అన్నియు బ్రతుకంగోరిన
నిన్నును బ్రతుకంగనిచ్చు ♦ నేలను-గన్మాం
బన్నిఁటి వదలినమదికే
యున్న దయాముక్తినమ్మి♦యుండు మస్థిరతన్ 3-౨౫

క. నారాయణ యను మంత్రమె
నారాయణ యనెడుసూక్తి ♦ నాకందముగా
నారాయణ యనుగ్రంథము
నారాయణునకు సమర్ప ♦ ణంబయి వెలయున్ 3-౨౬

క. కాలము నవమాసంబులు
కాలము తీరినదియంత ♦ కాలంబెపుడో
కాలపుఁదీవ్రత నెఱిఁగినఁ
కాలంబను కూలమగును ♦ గార్యంబులగున్ 3-౨౭

క. గుణమెటు గుఱుతును బొందును
గుణమే నారాయణుండు ♦ గుణమేతానై
గుణమున నైక్యముగాఁగన్
గుణితంబిఁక వలదువలదు ♦ గుణమేమన్నా! 3-౨౮

క. మైలవడు మాలపోతున?
యాలవాలుగ రామయుండిన నరిగన్నింపా?
అలిగియు నలుగప్రోచును
నిలను స్వతంత్రము లభించుఁ♦దృప్తగ నపుడున్ 3-౨౯

క. అడుగుము స్వాతంత్ర్యముగ నీ
వడుగక చెడిపోదువన్న ♦ యడిగినదిడు వాఁ
డడిగి గడియించు దాఁనకు
మడుగుము పరమాత్మయనుచు ♦ ననవరతంబున్ 330

క. నందిని బందిగఁజెప్పకు
మెందయినను సత్యమార్గ ♦ మెఱిఁగిన నీకా
నందమగు జగడమాడక
పొందికగా నున్న ముక్తిఁ ♦ బొందెదవన్నా ! 33౧

క. నడుమంతరంపు సిరిగని
వడివడి గర్వంబు చెంద ♦ వచ్చునె మనకుం
గడఁగి మొదలు నడుము చివరఁ
గడచినపద మొందనిష్ఠ ♦ గావింపఁదగున్. 33౨

క. వ్రాఁతయుగీతయుఁ గలుపుచు
నీతనువు తికించుకొన్న ♦ నేర్పదుశమమా
వ్రాఁతకుగీఁతకు జడియక
నేతకు దాసోహమన్న ♦ నేర్పగు సుమ్మా. 333

క. ధరఁబతియన బ్రహ్మకుఁదగు
నరపతియనఁ బ్రభునికగును ♦ న్యాయముగా నం
తరముం జూడక సర్వము
హరియని భావింపవలయు ♦ ననవరతంబున్. 33౪

క. చెప్పినఁ జేసియుఁ జూచియు
విప్పియు ముడివెట్టి మిఱల ♦ వీరాక్షి !
తప్పించుకొనుచుఁ దిరిగెద
విప్పుడు దప్పించుకొందువే ♦ యెటులైనన్ 33౫.

క. కవితయుఁ గడుపుబ్బరమగుఁ
గవనము జెప్పంగఁ దివురఁ ♦ గా నెట్టులైనం
దవిలి వెలువడక యుండినఁ
దెవులయి వేధించుగాదె ♦ దేబెలగూడన్. 33౬

క. వెంటఁబడి తిరుగు వారల
నింటంగసి నుడివెదన్న ♦ యియ్యది సోద్దా?
గంటివ భాగద్వయమును
కంటివ యేకాగ్రబుద్ధిఁ ♦ కడకొకలైనన్ 33౭

క. ఏడాది కందఱుంగన
నేడులు నైదైదులయ్యె ♦ నెంతటి గుఱుతో
యేడులోక యిఱువదుండఁగ
నేడులతో నేమిలెక్క ♦ యెంతటికైనన్. 33౮

క. దొంగతన మెఱుఁగకుండిన
దొంగను బట్టంగవచ్చు ♦ దొలఁగు నఘంబుల్
దొంగతన మింకమానిన
దొంగను బట్టంగఁ దగిన ♦ దొడ్డవు సుమ్మీ! 33౯

క. తలమాయక యొలుమాయక
తెలివిగలిగి యుండవలయును ♦ స్థిరవృత్తిని నీ
తలమాసిన నొలుమాసిన
నిలఁగలఁతలు గల్గుచుండు ♦ నింటను బయటన్ 3౪౦

క. నీమాయమంత్ర మంతెయు
నామాయము మంత్రమయ్యె ♦ నాకాలంబై
నీమాయ మాటలేటికి
నామాయపు సొమ్ముదొరక ♦ నాయువె తగ్గున్ 3౪౧

క. పైభాగము తాతయుఁగా
భూభాగం బన్వయమ్యె ♦ భూతలమందున్
నీభాగము నేఁజూడఁగ
నీభాగమె నీకున్నల్వ ♦ నీతియదేలా? ౩౮౨

క. గుఱుతును బట్టంజాలక
గుఱుతునుబట్టంగ ♦ గలుగు గుఱివిడిచితివే?
గుఱుతున్నది నీకోసమె
గురుతును బట్టఁగజాలు ♦ గుఱిఁగనవలయున్. ౩౮౩

క. చెప్పిన వినవలె గురువులు
చెప్పిన గనవలయు మనసు ♦ చెడిపోకుండం
దప్పవు జన్మక్రమము లిఁ
కెప్పుడు యుగధర్మమొకడె యెన్నికవడయున్. ౩౮౪

క. ముందున్నది భానుఁడు గద
ముందున్నది నీవుగదర ♦ ముందిఁక నీవా?
ముందనఁగ నేమి చెప్పుమా
ముందున్నది పండువనఁగ ♦ ముక్తియె సుమ్మా! ౩౮౫

క. తొందఱ శాంతము లేమియె
తొందఱనఁగఁగాగితములఁ ♦ దొలఁగించుటయా?
యందినది వండి తినుచో
నందముఁ బొందంగవచ్చు ♦ ననవరతంబున్ ౩౮౬

క. తెలివికిఁ దెలియందోడై
తెలివి గలుగువారి కిట్లు ♦ తెలుపఁగనేలా!
తెలివి గలవాఁడు దైవముఁ
దలఁపఁగఁ బగనొల్లరిల్లు ♦ దలఁగి వనమునన్. ౩౮౭

క. తిరుగక వీరారెడ్డియుఁ
దిరిగియుఁ దాగాంధి నుడివె ♦ దిరమని యిపుడా
వరములు శాపములన్నా
కొఱవయ్యెను దిరిపెమెన్నఁ♦కొఱవిఁకఁబూ త్రిన్ 3౪౮

క. పాడిన రైతుల కందము
పాడియుఁ బంటయును ధనమె ♦ పాడిగభూముల్
గాడెడ్లు గలిగి బండియు
వేడునుగా ప్రజలు బ్రదుక ♦ వేడుక నెపుడున్. 3౪౯

క. బిడ్డల గంటిని నేనని
వడ్డికి సొమ్మడుగ నడిన ♦ వడి వడినీరా
గడ్డను బెకల్చి పైరుల
నొడ్డులతో విఱుచునట్లు ♦ లొక్కటఁ గూల్చున్. 3౫౦

క. నరహరియని భగవంతుఁడు
తిరిపెంబెపు డడుగఁడన్న ♦ తిరిపెం బిడునా
తిరిపెంబని యొడిఁబట్టిన
వరిబియ్యమె వడ్లుయిచ్చి ♦ వడినోడి నింపున్. 3౫౧

క. తనఖర్చు లెక్కలేకయె
తనబుడుతల చదువుకొఱకు ♦ దగఁదెమ్మనఁగాఁ
దనబుడుత చదువు కొఱకు
ధనముసు దాఁచంగవచ్చు ♦ ధరణిని సక్తిన్. 3౫౨

క. జోలెయు మొనటను లేగయ
జోలెయుఁ దనచంకఁగన్న ♦ జోలెటెఁగి యిడున్
జోలెయుఁ బట్టని వేషము
లాలింపుల మదిని దెలిసి ♦ లాభముగాంచున్ 3౫౩

క. తేపకు లాభముఁ బొందఁగఁ
బాపంబను భీతివిడిచి ♦ పాలను నీళ్లన్
రూపొందఁ జేర్చి కనుగొనఁ
రీపండలటంచు నెంతు ♦ రే మోసమునన్. ౩౫౪

క. బతిమాలి చెప్పుకొనఁగా
గతిఁగానర దేమికర్మ ♦ కలియుగ మందున్
మతిపోయినట్లు చేతురు
పతిహీన కులటల ధనము ♦ పడయుటలేదే? ౩౫౫

క. పడమటి గాలికి నగ్నియె
చెడఁగాల్పదె గ్రామమెల్లఁ ♦ జెడుకాలమురాఁ
జెడుగుణముఁ బెంచి యొక్కఁడు
చెడఁగొట్టును బ్రజలమనసు ♦ చెడుకాలమునన్. ౩౫౬

క. తగుదుపని యెన్నకోఁగాఁ
దగవెఱుఁగని దొంగకన్నఁ ♦ దగదాఁపరియై
తగవే లంచము గుడువఁగఁ
దగదెన్నఁగఁ బశువుకన్నఁ ♦ దక్కువసుమ్మా! ౩౫౭

క. బేరంబు సాగదనుకొని
కోరరు త్రైశంకురీతి ♦ గొప్పదియనుచున్
గోరిక [illegible]రియుని దేవుని
గోరరు మోక్షంబుగూడఁ ♦ గోవిదనర్యుల్ ౩౫౮

క. ప్రొద్దొకమునపుడె యన్నమ?
సుద్దులకిఁక నేమి కొదువ ♦ శూద్రకులులకున్
పెద్దనఁగ నేమి కలదయ
పెద్దలకోడుండఁ దినినఁ ♦ బెనుబాదేమో? ౩౫౯

క. చెప్పఁగఁ బొరపాటులగుఁ
దప్పదుగా మృత్యువన్నఁ ♦ దనన టఁమే
యొప్పుల కుప్పగనుండఁగ
నొప్పులకిఁక సమయమేడ? ♦ నొసరంగనమా! ౩౬౦

క. అద్దమువలె స్వచ్ఛంబై
యిద్దఱి సాక్ష్యంబుగలసి ♦ ఇంతగనుండం
బెద్దది పాత్రముచంకను
బద్ధగనుండంగముక్తి ♦ వదలితిఁజుమ్మా ! ౩౬౧

క. అక్షర మక్కరమనుకొని
యక్షరముల గొడవఁగఱఁగి ♦ యక్షరమైతా
నక్షరము సర్వమనియా
యక్షరమునఁగఱఁగికలసి ♦ యక్షరమగుమా! ౩౬౨

క. ఊరక సిగ్గాపలుకంగ
నూరావలివేరనంగ ♦ నొప్పెదునది మా
యూరింటిపేరు బవనము
వీరారెడ్డియని పిలువ ♦ పీలయ్యేమహిఁ ౩౬౩

క. చాలనదీ సంసారము
పాలించుజనుండు సతము ♦ భ్రాంతినిజెందున్
నాలవపాల తిరతినిడఁ
బాలించును దైవమపుడె ♦ పాలనుముంచున్ ౩౬౪

క. నీజోలి గలిగినందుకు
నాజోలికివచ్చినావె ♦ నామామృతమున్
దాఁజెంది చొక్కుకున్న
నీజోలిని నెవ్వఁడెత్తు? ♦ నీవేచెపుమా. ౩౬౫

క. పలికెడి పలుకే నేర్పుం
బలికినా పలుకుఁదప్ప ♦ బల్కకనైనం
బలువురు సమమే కావునఁ
బలుకుటకే లజ్జగలిగి ♦ పలుకఁగనైతిన్ 3౬౬

క. సిరతంబీ లోకంబులు
పరమేశుని కోర్కి సరిగ ♦ వర్తింపంగా
సరిచూసి శాదనివాదనఁ
బరమేశ్వరు మఱచిచేయఁ ♦ బాడియె మనకున్ 3౬౭

క. మెఱికల యన్నము గుడుచుచు
గొఱియల కాఁపరిగనుండి ♦ కొలువఁగవచ్చున్
మెఱికల యన్నము లేదా
నెఱినూకల జావత్రాగి ♦ నెఱపుము భక్తిన్ 3౬౮

క. కవులెల్ల రప్పగింతల
గవులంతయు నెగురఁ గొట్టు ♦ గవి కరుణాళుల్
కవికృతి సంస్తుతిఁ జదివిన
జపమున నారాయణుండే ♦ సంతోషించున్ 3౬౯

క. తాటాకు నక్షరంబులు
తాటాకులు కట్టగట్టఁ ♦ దాటాకగుగా ?
పాటించి యక్షరంబులు
నోటంబాడఁగ హరి మ ♦ నోవీథిఁదోఁచున్. 3౭౦

క. నాయాఁకలి నే నెఱిఁగియు
నాయడిగిన వరము సడఁగ ♦ నాయదినాకై
నీయాఁకలి నీ వెఱుఁగఁగ
నీయాఁకటి సొదసుడిర్చు ♦ నెఱి దైవంబే. 3౭౧

క. చెప్పితి జాగ్రత యనినేఁ
జెప్పినఁ జెయి తెగనిచొప్పఁ ♦ జేయఁగ నీవుం
దప్పక దైవ బలంబన
నెప్పుడు మది నెఱుఁకగల్గి ♦ యెఱుఁగుదువన్నా ౩౨౨

క. నిజమునకు సర్వబాధలు
నిజమన నిపుణుండవయ్యు ♦ నిజమాడంగా
నిజమే దేవుఁడ టందురు
నిజమే కావంగ వలయు ♦ నెటిజగమునఁ దున్. ౩౨౩

క. దిద్దితి ముప్పది రెంటిని
శెద్దకు నొక యక్కరంబె ♦ పెనుపోఁ పాడో
ముద్దొకటి కొఱవె తినఁగా
ముద్దుగ నీకన్నులు పలుక ♦ మిచ్చటతీఱన్— ౩౨౪

క. నియమముగ డబ్బులాటల
జయముగ జోకరయుఁగల్గ ♦ జయమొందునుగా
నియమముగ నాడవలెనఁట
జయమున దైవంబు గలసి ♦ జయమొనరించున్. ౩౨౫

క. దేవుడు లేడని కొందరు
కావరమున దీపమార్పి ♦ కనకము దోఁచుర్
గోవుకలె సాధువృత్తిని
దావును విడనాడకున్న ♦ ధన్యుఁడు మనసా! ౩౨౬

క. శరియింపక వేమనకృతిఁ
బరియించితి జ్ఞానవహ్ని ♦ ప్రభవించెన దే
పరియించుమ "యోంకారము"
పరియించుమ కందములు శు♦భప్రదమార్గా! ౩౨౭

క. పనిలేనివి-విధిచేఁతలు
పనిపట్టియుఁ బిల్లితలను ♦ బఱిసఱి గొఱుఁగున్
మనకర్మఫలం బింతయు
మనసునకే తెలియకున్న మరణము గాదా? ౩౨౮

క. మతిదెలియఁ గొట్టుకొందువు
మతియనఁ బ్రాణప్రదంబు ♦ మహి దిసగును దా
మతిగలుగ నేమిచెప్పుదు
మతిమంతుడవైనముక్తి ♦ మార్గముఁదొరకున్ ౩౨౯

క. మగువలు చెప్పిన రీతిగ
మగవారు మెలంగుచున్న ♦ మంచిది యెటులో
మగవార లెఱుఁగ కుండిన
మగువలె మగవారికె ఱుఁగ ♦ మాట్లాడఁ దగున్ ౩౩౦

క. తప్పనక చెప్పఁ బూనఁగఁ
జెప్పులజతలెన్ని తెగిన, ♦ జెవిఁజొరునొక్కొ-
చప్పుడు తన్మదమణఁగిన
జెప్పిన పనిచేయఁజొచ్చు ♦ జెనఁటిసుకృతియై ౩౩౧

క. ఆడుగఁగనేయప్పిడఁగాఁ
జెడునైగెధనమెల్లఁదనకుఁ ♦ జేఁజిక్కఁగనే
బడిబడియెన్నో విధముల
నడిగిననాపనిని దీర్పఁ ♦ డంతటిమదమే? ౩౩౨

క. విధిగతికిఁ జెప్పఁదగునా?
విధమెఱుఁగంబడును వయసు ♦ విదితముగాఁగన్
విధిసుకృతమెవ్వఁ డెఱుఁగును
విధనే పొగడంగవలయు ♦ విధమిదిసుమ్మా! ౩౩౩

క. బలముండిననే పాటగు
బలముడిగిన శ్రమయెసున్న ♦ బడలిక చేయున్
బలముండు వస్తువుంగని
బలమునుగలిగియుండగఁ బలుకు ♦ బలమిది జగతిన్ ౩౮౪

క. కడలిజలంబును గాంచియు
గడవెఁడు దల నెత్తుకొనుట ♦ కలదనరుగదా !
యడిగినదంతయుఁ గోరిన
వడివడి నింపంగ నెవని ♦ వశమగుఁ దండ్రీ ౩౮౫

క. తాతకు దగ్గులు నేరుపు
భాతిని నీకడను మాయు ♦ ప్రకటించుటయో
తాత భవత్కృపఁ గోరుట
యేతరణోపాయ మితర ♦ మేయది తండ్రీ ! ౩౮౬

క. మునులకు సర్వజనాళికిఁ
జనముఖమే కానుపించు ♦ దర్పణమందున్
మనుజుని ముఖముంజూడఁగ
తనువును విడదీసి కనుట ♦ తగ దెవ్వరికిన్ ౩౮౭

క. ఎందాకఁ గొలువఁగాఁదన
పందెమునకుఁ బుడకలెల్ల ♦ భగభగఁగాల్చే
సుందరికి గుణము కుదురక
కుందిన సంసారి పొట్లో ♦ కో కడతేరున్. ౩౮౮

క. కుడియొకటికంటెఁ బడఁగనె
పెదవులరాపిడిని రవము ♦ పెంపగు సంతన్
మదికనుభవ మిడుచుండును
హృదయముగలవారికెల్ల ♦ నీధరయుంమన్ ౩౮౯

క. ఆదియే మిదియే మనియెదు
మది బ్రార్థన భక్తిం జేయ ♦ మనుచును హరియున్
బదిసారులు నన్నడిగిన
నదితంబుగఁ జెప్పఁగలనె ♦ విబుధులకనఘా ౩౯౦

క. పుట్టక యుంటయె సుఖమిలఁ
బుట్టినిపోరాట మిదియె ♦ పూనికతోడన్
దిట్టముగ దైవదీక్షను
బట్టిన నది పట్టువిడకు ♦ పరమును గాంచన్ ౩౯౧

క. పరకడుపునకిడు కోరికఁ
బరుగునఁ బరజంతువులను ♦ బట్టివధించున్
బరికింపఁ బంది మేలగుఁ
బరకడుపునఁ బెంటనంటి ♦ పట్టదు దేహీ. ౩౯౨

క. ఊతకు సేతకు గాంధీ
తాతయె యుపమానమెన్నఁ ♦ దాత్కాలికము
య్యాతన బొందెను గావున
నే తెలుఁగునఁ బ్రొయ్యి రాజు ♦ నిఁక దేశమునన్. ౩౯౩

క. హద్దును మీఱియు రాఁగాఁ
పెద్దపుగద చెప్పుమనుట ♦ పిచ్చవరోక్తి
యిద్దఱు గుఱుతును గని తమ
హద్దును గోరంగఁ దెలియు ♦ హరిదయనంతన్ ౩౯౪

క. ఇద్దఱి యుద్ధము విద్యయె
పెద్దవు నీవంచు బిట్ట ♦ బ్రేలకు మెపుడున్
బ్రొద్దుండు చెలిమి నెఱిఁగినఁ
బ్రొద్దెఱుఁగని బిచ్చగాని ♦ పోలికనుందున్ ౩౯౫

క. ఏటికి వాదన లెక్కువ
యేటికి సాంతముగ వినక ♦ హేళనగా నా
ర్భాట మొనర్తురు బుధులకు
వాటముగాఁ జెప్పవచ్చుఁ♦బ్రౌఢిమ మెఱయన్ 396

క. కంటికిఁ గరపాదము లకుఁ
జంటికి నితరావలూవ పు ♦ సమితికి జబ్బే
మంటిన దఁన బ్రాణంబుల
నొంటిని నిలుపంగ దైవ♦మొనయుచు క్రియయే. 397

క. కొడుకునకు స్వేచ్ఛ నిడుట య
కొడుకంతట ఘనత దెచ్చుఁ ♦ గొడుకే మనునో
యడుగక యంబలిఁ బోయఁగ
నెడఁగట్టిని జూచి చెనంట ♦ వినవే యెప్పుడున్. 398

క. మొఱకువలెఁ బెరుగు చుండఁగఁ
దురగా ఆనందమంత్రి ♦ స్తుతమతి నాకుం
గఱపెను విద్యా బుద్ధులు
పరిపరిఁ దద్గుణుని మదిని ♦ బ్రస్తుతి చేతున్ 399

క. నేరిచి నటుకందబులఁ
గూరిచి మీ యెదుట నిడితిఁ ♦ గోవిద వర్యుల్ !
గూరిమిఁ బఠించి దొసఁగుల
నేరి యెఱింగింపె భక్తి ♦ నెఱుఁగుదు సతమున్ 400

క. వెన్నెల తీరుగనుండదొ
తిన్నఁగ దిద్దంగనెవఁడు ♦ ధీరుఁడు చెపుమా
సున్నితముగ నోరనకయె
చిన్నతనంబయ్యె ననుట ♦ చెల్లునె మనుజున్. 401

క. కాఁబడిన వెల్ల దిద్దుచుఁ
గాఁబడఁగాఁ జేయునట్టి ♦ కర్తవునుమ్మా
నీబలముఁ జెప్పఁజాలము
నీ బలమే బలము దేవ ! ♦ నీరజనయనా ! ౪౦౨

క. ఊహను బేరును మానిన
కారణమున జెప్పవిధము ♦ గాఁగా పోడనే
బోహగనుండుట మానుము
పోహన సుఖమెట్లు కలుగు ♦ భూలోకమహనస్. ౪౦౩

క. ధరసరకుసామ్యు గానగు
నరుఁడనఁగించిజ్ఞుఁడగును ♦ నారాయణుఁడౌ
ర్వారనన్నిఁటఁ దాఁగావున
సరియగు రోచనను జేసి ♦ సరిపుచ్చఁదగునే. ౪౦౪

క. నరుఁడాత్మఁ గాంచి తనువును
మఱచిన నదిచాలునంత ♦ మంత్రార్థంబౌ
గురుఁడొసఁగిన మంత్రమునే
మఱవక జపియింపవలయు ♦ మాపుర్ రేపుర్ ౪౦౫

క. మనుజుఁడు నేననదగునా ;
కనఁగన హంకారమందుఁ ♦ గల్గును గాదా ?
కనులకుఁ బందువుగాఁదన
ఘనతను జూపంగఁదగునె ♦ ఘనునకునైనన్. ౪౦౬

క. ఒక్కఁడు దేవుండనఁగా
మ్రొక్కఁగఁ దావరమునిడఁగ ♦ మూలము దెలిసెన్
నిక్కపు శ్రద్ధను నిలిపిన
నిక్కము దెలియంగవచ్చు ♦ నిపుణులకెందుర్. ౪౦౭

క. కావలసిన దేమిటిదగు
వేవిధములఁ జెప్పుటకును ♦ వెనుకాడకురా
దేవుని వర్తనమును గురు
దేవుఁడె తెలుపంగవలయుఁ ♦ దెలియఁగనెవ్వడున్ ౧౦౮

క. పాలకుఁ దోడుం బెట్టినఁ
బాలేమియుఁ గానఁబడక ♦ పరవుగఁ బెరుగౌ
నాలాగున దేహికి (శ్రీ)
లోలుఁడు తోడైనఁబరుని ♦ లోఁగలియునురా ౧౦౯

క. ఒకయూర నొక్కపురుషుఁడు
నొకభానుఁడు కంటఁబడుట ♦ యొకతావుననౌ
నొకసారి మాటగలిసిన
నొకయక్షర మదిలభించు ♦ చుండునుబరమై ౧౧౦

క. మఱుగెందున భగవానుని
మఱచియుఁ గనుదెఱవరయ్య ♦ మదినిండిన నీ
పిఱికితనంబది మానినఁ
బరమార్థము గట్టిదగుట ♦ భావింపుమురా. ౧౧౧

క. రేపునఁ గనువిత్తంబును
గాపాడను మంచిజెడ్డఁ ♦ గనుఁగొనకుండున్
మాపుల మూపుల మోయుచు
సేపునఁ దనగతిని సుంత ♦ యెఱుఁగక యకటా! ౧౧౨

క. వేఱగుట నెచ్చుకోరిక
వేఱగుటకు విధిని దెల్ప ♦ వీలగునొక్కొ
నోరున్నరీతి వాగకు
మూరక పడియుండవలయు ♦ నోంకారమునన్ ౧౧౩

క. పెద్దఁగదనుఁ జూడందన
రొద్దకురాఁ దగదటంచు ♦ నోడకయను నా
సుద్దుల సుఖమున్నదో కో
ప్రొద్దున నే యిట్లు తెల్పఁ ♦ బోలదు తండ్రీ! ౨౧౪

క. నాకున్న కోర్కె యిటులగు
నీ కోరిక నెగ్గువఱకు ♦ నేనుండంగాఁ
దూకము సరిపోయిన తఱిఁ
బాకము మదిఁ దెలిసికొన్న ♦ ఫలమిది తండ్రీ! ౨౧౫

క. కలియును నంబలియును గాని
యులుకుచుఁ దిరిగెదరు దాన ♦ నొడలికి రాదా?
పొలకువ పులవంకగునా?
మెలకువతో సంతసంబు ♦ మెలఁగుము తండ్రీ! ౨౧౬

క. సుద్దులకు నేమి కొదువా?
ముద్దుగఁ దగుబాట నెఱుఁగు ♦ ముక్తిఁగనంగా
బద్దకము దేవు నెఱిఁగెడి
సుద్దులె మోక్షంబు దాన ♦ శుద్ధులు మనుజుల్ ౨౧౭

క. కాలమొక లెక్క మనసునె
కాలపు వర్ణనముఁ దెలియఁ ♦ గారణమగుఁదాఁ
బోలిక సరియగుఁ గావునఁ
బోలదు పరమేల యనుట ♦ భోగివిగానన్. ౨౧౮

క. అబ్బఁగఁ దెలియం గలరొక
డబ్బును సాధించుకతన ♦ డాబుగ వేషం
బబ్బిన సంగతిఁగనఁగా
నబ్బును మోక్షంబుగాంచ ♦ నఱుదెవ్వసకిన్. ౨౧౯

...?

...క్కి ♦ యొనసినబాధఁ

...ం ♦ లేశంబైసన్. ౪_౨౦

...ంతేయు నుడువం
గలమా? మంత్రమునె నుడువఁ ♦ గారాదుసుమీ
తలఁచి కొనుతలఁపు తోడుతఁ
దెలిపిన మంత్రమున సిద్ధిఁ ♦ దెలియఁగవలయున్ ౪_౨౧

క. వినఁబడునపుడనుకోఁగల
ఘనులకుఁ గాన్పించుజ్యోతి ♦ గాఢముగాఁగన్
మన సంతరించునపుడే
ఘనయును బరమాత్మనందు ♦ నీజీవుండున్ ౪_౨౨

క. ప్రాప్తంబు నొందఁ గలిగియుఁ
ప్రాప్తంబునఁ జెప్పుటెట్లు? ♦ పరమాత్మండే
ప్రాప్తంబన నీ గ్రంథమె
ప్రాప్తముగాఁ జదువముక్తి ♦ ప్రాప్తంబౌఁబో ౪_౨౩

క. మన మనుగడ యెట్టిదియో
కనుఁగొనఁ గారాదుశాస్త్ర ♦ ఘనులకునైనన్
పసిగా నిదేవుఁ డనెదరు
పనిగల్గియె చేయవలయు ♦ పరముకొఱకునై. ౪_౨౪

క. ఎఱిఁగిన మేళము లేరా
పరమేశుని కరుణగల్గు ♦ బ్రతుకెఱుఁగుమురా
పరమేశ్వరు దయఁగానక
పరమంబే లేదిహంబు ♦ భయదము సుమ్మీ. ౪_౨౫

క. ఈ రీతిఁ జెప్పసాగుదె ?
నీరీతిం దెలిసియున్న ♦ నే
గౌరీశుని సేవించిన
వారికె పరమబ్బు మృత్యు ♦ భ

క. చూడంజూడఁ గనద్దము
జూడను సుజ్ఞానమబ్బఁ ♦ జూవెందునగున్
వేఁడఁగ దైవంబొక్కఁడె
కాఁడా ? త్వరపడఁగనేల ♦ కామము తొలఁగన్ ౨౨౭

క. పేరుండె నేతి బీరగ
పీరారెడ్డి యని, యతఁడె ♦ విసువక వ్రాసెఁ
నేరిచినట్టులఁ గంధము
లారసి గుణములని కొనఁగ ♦ నంజలి సేతున్ ౨౨౮

క. తిట్టుటకుం దగవయ్యా !
పెట్టుటకే పెద్దవయ్య ♦ పృథివీస్థలిపైఁ
గొట్టుటకుఁ జెట్టుచేమలె !
గుట్టుగవిను మొద్దులైనఁ ♦ గొట్టకుమయ్యా! ౨౨౯

క. పంతులుగల బాలురకును
సంతోషము గలిగి చదువు ♦ చదువఁగవలయున్
మంతనముగఁ బంతుళ్ళను
గంతులిడక యుండఁ జదువు ♦ గమనింపవలెన్ ౨౩౦

క. పెద్దలఁగలరా యూరను
గద్దెయనుచుఁ గూయు సింగి ♦ గాదన రేమో ?
పెద్దలు పురిలోఁ గలిగినఁ
దద్దయు నెఱిఁ తనజూచి ♦ తన్నఁగవలయున్ ౨౩౧

క. గద్దెయని యడవసాగిన
సద్దిని యొకగ్రుడ్డు గ్రుడ్డు ♦ వాఁడుండినచోఁ
బొద్దులను శాంతమబ్బును
బుద్ధియుఁ గుద్దులకుఁ గల్గు ♦ భువిసీరయ్యా! ౨౩౨

క. తెల్లోకిఁ బిల్లకు సుఖముగు
కల్లలు గుడ్డలును నిజము ♦ గలియుగమందున్
గల్లలు పూన్పఁగఁ బెద్దలె
యుల్లంబున సతమ్ముఁగోరు ♦ చుంద్రు నిజముగన్ ౨౩౩

క. కలిగిన సనుమానములో
నిలువంబను నాయమెద్ది? ♦ నిజముం జెప్పుమా
తలమును దాఁపఁగఁదగునా?
సలలితముగ మాటలాడు ♦ సరసుఁడవైనన్ ౨౩౪

క. శామ్మనని తాతదవ్వునా
సామ్మును గుడువంగఁ జూచు ♦ సొంపెఱుఁగుమురా
సామ్మున గుట్టుగ సీరయ
నెమ్మదిగాఁ జెప్పుచుందు ♦ నీతియొసుమ్మీ ౨౩౫

క. పసవను శ్రేష్ఠగ నడపుచు
సుడిగుండము తెల్లఁగడచి ♦ సూటిగఁజనఁగా
సుడిగుండము లోతెఱింగి
వడిగాదరిఁ జేరియున్న ♦ వశమగు సుఖమున్. ౨౩౬

---

దాస్ ఆర్టు ప్రెస్, తెనాలి.



దొరకుచోటు:

తమ్మా అప్పిరెడ్డిగారు,

(తండ్రి వీరారెడ్డి)

వలివేరు. (పోష్టు)

(తెనాలి తాలూకా - గుంటూరుజిల్లా)



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPL A102 B180 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | i, ii, iii, vi |
| లేని పేజీలు | 29,30 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | No |
| పరిస్థితి | good |